# THE ANDHRA LEGISLATIVE ASSEMBLY

*Thursday, the 29th March,* 1956

The House met in the Assembly Hall Kurnool at half-past eight of the clock, Mr. Speaker (The Hon. Sri R. Lakshminarasimham Dora) in the Chair.

## I. QUESTIONS AND ANSWERS.

### SHORT NOTICE STARRED QUESTIONS.

*Land census of the land holdings in the State.*

668-A.

S. N. Q. No. 1302-B. Q.—Sri V VISWESWARA RAO :— Will the Hon the Minister for Revenue be pleased to state :

(a) Whether the Government have prepared the land census of the land holdings in the State ; and

(b) if so, will it be placed on the Table of the House ?

The Hon. Sri K. CHANDRAMOULI :—

(a) Yes.

(b) Statement summarising the results of the census are placed on the Table of the House.

Sri G. YELLAMANDA REDDI :—అధ్యక్షా, ఈ land census ప్రకారం సుమారు 86—40 లక్షల ఎకరాలలో 15 లక్షల ఎకరాలు పంపకానికి Planning Commission చెప్పిన లెక్కల ప్రకారం ఉన్నది. కాని ముఖ్య మంత్రిగారు మాట్లాడుతూ ఒక సందర్భంలో ఒక లక్ష మాత్రం ఉన్నదని చెప్పారు. ముఖ్య మంత్రిగారి statement సరైనటువంటిది కాదని గమనిస్తారా ?

The Hon. Sri K. CHANDRAMOULI :—యల్లమందా రెడ్డి గారు చెప్పింది పొరపాటు. ముఖ్య మంత్రిగారు అట్లా చెప్పలేదు. ఒక లక్ష ఎకరాల భూమి యిదివరలో యిచ్చారని చెప్పి ఉంటారు. లక్ష ఎకరాలున్నదని

---

Vide appendix at pages 578 infra.

చెప్పలేను. This Census Report is not actually correct up to the i. e. 1953 data తీసుకుని దాని ప్రకారం చెసినటువంటివి. దీంట్లో కూడా [illegible] పట్టాలు అయినటువంటివి ఉన్నవి వాటిల్లో correct లెక్కలులేవు.

SRI VAVILALA GOPALAKRISHNAYYA :—ఇది జిల్లాల వారిగా ఉంచలేముగదా ?

THE HON. SRI K. CHANDRAMOULI :—Separate question వేయండి.

SRI S. VEMAYYA :—Land census తయారు చేసే సమయంలో జిల్లా unit గా తీసుకున్నారా ? State ను unit గా తీసుకున్నారా ? ఈ unit యొక్క సందర్భం ఏమిటి ?

THE HON. SRI K. CHANDRA MOULI :—ఇది ఏ జిల్లాకు ఆ జిల్లా గానే చేశారు. Unit తీసుకున్నప్పుడు ఒక ఎకరం unit గా తీసుకుని joint పట్టాలు, వేరువేరు పట్టాలు, యినాం భూములు estate లు యివన్నీ వేరు వేరుగా survey చేశారు.

SRI S. VEMAYYA :—నా question సరైన విధంగా అర్థం చేసుకో లేదనుకుంటాను. Unit అంటే ఒక గ్రామంలో అనేక వందల ఎకరాలుండవచ్చు. ఇంకో తక్కువవుండవచ్చు, అనేక జిల్లాలలో ఉండవచ్చు. ఇవన్నీ కలిపి ఒక unit గా తీసుకుంటారా ? లేకపోతే ఏ విధంగా తీసుకుంటారు ?

THE HON. SRI K CHANDRAMOULI :—అన్నీ కలిపి తీసుకోరు, ఏ గ్రామానికి ఆ గ్రామం లెక్క వేస్తారు కాని ఎకరం as a unit. వాళ్ల ఎకరం అంటే మనం అనుకునే ఎకరంకాదు. వాళ్లకు వేరే calculation ఉన్నది. అది చెప్పమంటే చెప్పతాను.

SRI PILLALAMARRI VENKATESWARLU :—4, 5 గ్రామాలు కలిపి పొలం ఉంటుందనుకోండి. అదంతాకూడా consideration లోకి తీసుకుంటారా, లేక ఏ గ్రామానికి ఆ గ్రామం అనే విషయం తీసుకుంటారా ?

THE HON. SRI K. CHANDRA MOULI :—రైతుకు ఎక్కడ పొలా లున్నాయో అన్నీ లెక్కలు తీసుకుని మొత్తంగానే లెక్కలు వేస్తారు.

SRI G. NAGESWARA RAO :—అధ్యక్షా, ఇవి కూడా సరైన లెక్కలు కావంటున్నారు. అంటే సరైన లెక్కలు upto-date లెక్కలు యీ Session లోగా సభ్యులకు అందజేస్తారా ?

29th March 1956]

THE HON. SRI K. CHANDRAMOULI :—అది సాధ్యంకాదు.

SRI VAVILALA GOPALAKRISHNAYYA :—ఇది Firka మొత్తంలో ఉన్న పొలం లెక్కా? లేక తాలూకా లెక్కా? రాష్ట్రం మొత్తం మీద అంతా కలిపి holdings లెక్కా?

THE HON. SRI K. CHANDRAMOULI :—Land holdings అంటే మొత్తం రాష్ట్రంలో ఉన్న పొలం అంతా లెక్క వేసినప్పుడు ఏ ఊరికాఊరు లెక్కవేసి Tahsildars తాలూకా లెక్కలు తీసుకొని వేసుకున్నారు

SRI PILLALAMARRI VENKATESWARLU :—Statistics ఉన్నాయి. కనుక ceiling పెట్టే విషయం త్వరలో ప్రభుత్వం తేల్చడానికి వీలున్నది. కనుక అది తేలుస్తారా?

THE HON. SRI K. CHANDRAMOULI :—ఆ విషయమై land reforms త్వరగా తీసుకువస్తాం అని యిదివరకే చెప్పాం.

SRI G. YELLAMANDA REDDI :—ఈ లోపున కేంద్ర ప్రభుత్వం వారు పంపించినటువంటి questionaire ప్రకారం గ్రామోద్యోగులు లెక్కలు తయారుచేస్తున్నారు. అవి చాలా perfect గా తయారుచేస్తున్నట్లు తెలుస్తున్నది. అలాంటి వాటిని తయారుచేసి సభ్యులకు అందజేయడానికి ప్రయత్నం చేస్తారా?

THE HON. SRI K. CHANDRAMOULI :—ఆ లెక్కలు యింత వరకు రాలేదు. వచ్చిన తరువాత చూస్తాం.

## *Scales of pay of village officers.*

668-B.

**S. N. Q. No. 1305-F. Q.—SRI P. GUNNAYYA :—Will the Hon. the Minister for Revenue be pleased to state :**

**whether there is any proposal to give the scales of pay of other village officers, to Karnams, Munsiffs and Talaries in Zamindari areas now taken over ?**

**THE HON. SRI K. CHANDRAMOULI : —**

**The proposal to enhance the pay of village officers in the estates taken over by the Government to the level of ryotwari scales is under the consideration of the Government.**

Estate లలో ఉన్నటువంటి గ్రామాధికార్లయొక్క జీతాల్ని రైత్వారీ ప్రాంతములలో వున్న దానికి తీసుకురావడానికి ప్రభుత్వం ఆలోచనలో ఉన్నది.

SRI PILLALAMARRI VENKATESWARULU :— అధ్యక్షా, క్రిందటి తడవ ఒక నోటికమైన ప్రశ్నకు సమాధానం చెబుతూ యీ Budget లో పు చేస్తాం అని చెప్పి మంత్రిగారు చెప్పారు. ఈ Budget లో ఏమీ provision లేదు. లేకపోయినా యివ్వడానికి వీలుంటుందనే మంత్రిగారి ఉద్దేశ్యమా?

THE HON. SRI K. CHANDRAMOULI :—లేకపోయినా వీలున్నది. Finance Committee యివన్ని ఆలోచించబడినాయి. ఇప్పుడు చేయడానికి వీలున్నది.

SRI G. NARASIMHAMURTHI :—అధ్యక్షా, రైత్వారీ గ్రామాలలో గ్రామోద్యోగుల కున్నటువంటి scale ప్రకారంగా estate గ్రామాల్లో ఉన్నటువంటి గ్రామోద్యోగులకు, గ్రామనౌకర్లకు చేస్తాం అని మంత్రిగారు సెలవిచ్చారు. జమీందారీ abolition రాష్ట్రంలో అమలులోకి వచ్చిన తేదీనుంచి యీ scales వారికి ముట్టేలాగు ప్రభుత్వంవారు ఏర్పాట్లు చేస్తారా ?

THE HON. SRI K. CHANDRAMOULI :—ఒక్కొక్క estate ప్రభుత్వ స్వాధీనం అయినటువంటి date వరకు యిదివరకు జీతాలు లేకుండా ఉండేటటువంటి నెల్లూరులో చిత్తూరులో retrospective effect యిచ్చాము. ఇక జీతాలు ఎక్కువ చేసే విషయంలో అసలు గ్రామాలను re-group చేయాలి. అలా re-group చేసిన తరువాత ఆలోచిస్తాము.

SRI PILLALAMARRI VENKATESWARLU :—ఇప్పుడున్నటువంటి గ్రామాలను re-group చేయడంవల్ల ఉద్యోగులను తీసేయడం ఉండదుకదా? అలాంటప్పుడు వారి జీతాలను ఎక్కువ చేయడానికి ఆలోచించవలసినది ఏమున్నది ?

THE HON. SRI K. CHANDRAMOULI :—చిన్న unit కు అక్కడ కరణం, మునసబు ఉంటే కొన్ని గ్రామాలు group చేసి రైత్వారీ level కు తెచ్చినప్పుడు రైత్వారీ జీతం కావాలంటే కొన్ని సౌకర్యాలు forego కావాలి.

SRI PILLALAMARRI VENKATESWARLU :—రైత్వారీ level లో మాత్రం చిన్న చిన్న గ్రామాలులేవని మంత్రిగారి ఉద్దేశ్యమా?

THE HON. SRI K. CHANDRAMOULI :—లేవని చెప్పను. దానికి కూడా ఒక minimum ఉండాలి.

SRI L. LAKSHMANA DAS :—అధ్యక్షా, ఇప్పుడు estates లో వున్న village offices కు చిన్న చిన్న పనులు కొన్ని ఉన్నాయి. ఇంకొన్ని ఆలోచించిన తరువాత జీతాలు పెంచుతాం అన్నారు. కొం వాళ్లపనులు యెక్కువ Government villages లో వున్నవారికంటె పనులు తక్కువ కావు. అందుచేత re-group చేసేటప్పుడు కంటనే యీ జీతాలు మంజూరుచేస్తారా ?

THE HON. SRI K. CHANDRAMOULI:—Re-group కాక మునుపు చేయడానికి వీలులేదు. ఈలోపల heavy work ఉండేచోట కొంత percentage యిస్తారు

SRI D. KONDAIAH CHOWDARY :—ఈ estate ను 1950-51లో తీసుకుని ఉన్నారు. 4 సంవత్సరాలనుంచి కొన్ని గ్రామాలలో జీతాలులేకుండా ఉండడం జరిగింది నామకావాస్తే జీతాలుంటాయి కాబట్టి మొత్తంగా వాళ్లకు డబ్బు యిచ్చుటకు ఎన్నిరోజులు పడుతుంది ? ఇంకా 4, 5 సంవత్సరాలు పడుతుందా ? దీనికి కావలసిన డబ్బు ఎంత వస్తుంది ?

THE HON. SRI K. CHANDRAMOULI :—4, 5 ఏండ్లు పట్టదు కాని, జీతాలులేనివాళ్లకు జీతాలిమ్మని యిదివరకే Order లు పోయినాయి. బహుశా వారందరికి జీతాలు ఇస్తూవుంటారు ఇప్పటికి.

SRI MAHAMMAD TAHSEEL :—అధ్యక్షా, మా ఏజన్సీప్రాంతము లలో ఉన్న కరణము మునసబులకు నెలకు 2, 3 రూపాయిలు జీతము ఇస్తున్నారు. వాళ్లకు రైత్వారీ ఏరియాలలో ఉన్నవారితో సమానంగా జీతములు ఇచ్చేదానికి ప్రయత్నముచేస్తారా ?

THE HON. SRI K. CHANDRAMOULI:—వేరే ప్రశ్న వేయండి.

SRI SHEIK MOULA SAHEB:—అధ్యక్షా, గ్రామోద్యోగుల జీతాలు హెచ్చుచేసే సందర్భములో వారికి వంశపారంపర్య హక్కు ఉంచుతారా ? లేక రద్దుచేసి ప్రభుత్వోద్యోగులమాదిరిగా మార్పులు చేస్తూవుంటారా ?

THE HON. SRI K. CHANDRAMOULI :—వంశపారంపర్య హక్కు వారికి ఉన్నది. జీతములు హెచ్చుచేస్తారా అంటే ఆలోచిస్తాము అని చెప్పినాను.

SRI PILLALAMARRI VENKATESWARLU :—అంతాకూడా రైత్వారీ జీతాలస్థాయికి తీసుకువచ్చినట్లయితే తేడా ఎంత ఉంటుందో చెప్పగలరా ?

THE HON. SRI K. CHANDRAMOULI :—వేరే ప్రశ్న వేయండి.

SRI G. NAGESWARA RAO :—అధ్యక్షా, ఈ ప్రశ్న ప్రతిసమావేశములోనూ వస్తున్నది ప్రతిసారికూడా ఆలోచిస్తాము అని చెబుతున్నారు. అయితే ఇప్పుడు మంత్రిగారు దానిని 3 నెలల్లోనో 4 నెలల్లోనో ఖచ్చితంగా చేస్తాము అని చెప్పగలరా ?

THE HON. SRI. K. CHADRAMOULI :—రోజూ ప్రశ్న వేస్తూంటే సమాధానం ఏమి చెబుతాము. అందువల్ల ప్రతిసారి ప్రశ్న వేయకుండా ఉండటం మంచిది.

SRI S. VEMAYYA :—అధ్యక్షా, village officers ను చీటికిమాటికి అధికారులు సమన్లుపంపించి పిలిపిస్తున్నప్పుడు, వాళ్లకు T. A. ఇచ్చేందుకు ఆలోచిస్తారా ?

MR. SPEAKER :—That is a different question.

SRI G. YELLAMANDA REDDI :—అధ్యక్షా, కృష్ణాజిల్లా, దివి తాలూకాలో గ్రామోద్యోగస్థులందరూ జీతాలు చాలనందువల్ల సమ్మెచేస్తున్నట్లు తెలిసింది. ఆ విషయము ప్రభుత్వానికి ఏమైనా తెలుసునా ?

THE HON. SRI K. CHANDRAMOULI :—సమ్మెలుచేస్తే దానికి తగిన చర్య గట్టిగా తీసుకుంటాము.

SRI P. GUNNAYYA :—అధ్యక్షా, గ్రామోద్యోగస్థులకు పనిభారం ఎక్కువ అయింది కాబట్టి వారికి జీతములు హెచ్చించే విషయము ఆలోచిస్తారా ?

MR. SPEAKER :—ఇంతసేపు ఆవిషయం మీదనే ప్రసంగం జరుగుతున్నదండీ ?

SRI VAVILALA GOPALAKRISHNAYYA :—అధ్యక్షా, ఇప్పుడు taken over estates ను, అగ్రహారాలను ప్రభుత్వం తీసుకోవడం జరిగింది. అప్పటి వాటికి వెంటనే రైత్వారీ ఏరియాలో ఇచ్చే గ్రామోద్యోగస్థులజీతములు ఇస్తారా ?

THE HON. SRI K. CHANDRAMOULI :—వాటిల్లో ఉన్న staff ను ఎంతవరకు తీసికోవాలో ఎవరెవరిని తీసుకోవాలో ఆలోచనలో ఉన్నది. అన్నీ తీసుకుంటున్నాము. ఇంకా కొన్నిచోట్ల తీసుకోవలసి ఉన్నది.

SRI PILLALAMARRI VENKATESWARLU :— అధ్యక్షా, ఎక్కడ సమ్మెచేస్తున్నారంటే తగినచర్య తీసుకుంటాము అంటున్నారు. వాళ్లకు

జీతములు చాలక సమ్మె చేస్తున్నారు జీతాలు ఎక్కువచేసే విషయం ఏమైనా ఆలోచిస్తున్నారా ?

THE HON. SRI K. CHANDRAMOULI :—జీతాలు ఎక్కువ చేసే విషయం ఆలోచిస్తాము అంటే ఇంకా సమ్మె చేస్తున్నారు.

*Supply of Electricity to Vijayawada Taluk for irrigation purposes.*

668-C.

S. N. Q. No 1306-A. Q -SRI V VISWESWARA RAO .—Will the Hon. the Minister for Electricity and Social Welfare be pleased to state .

(a) whether the Government received any memorandum from the villagers of Kotikalapudi and Damulur, Vijayawada Taluk, requesting for the supply of electricity to the water pumping sets for irrigation ; and

(b) if so, the action taken thereon ?

THE HON. SRI G LATCHANNA :—

(a) The answer is in the affirmative.

(b) The feasibility of extending supply to Kotikalapudi and Damulur is under investigation.

(a) ఔనండి

(b) పరిశీలనలో ఉన్నది.

SRI S. VEMAYYA :—అధ్యక్షా, ఈ దరఖాస్తు ప్రభుత్వానికి ఎప్పుడు అందినది? దీనిని ఎప్పుడు పరిశీలించడానికి పూనుకుంటారు ?

THE HON. SRI G. LATCHANNA :—ఈ దరఖాస్తు సెప్టెంబరు 1955-వ అందినది. 1956 సంవత్సరంలో దీనిని పరిశీలించడానికి Chief Engineer గారివద్దకు పంపించాము. పరిశీలన జరుపుతున్నారు దానికి rough estimation 65 వేల రూపాయలు. Investigation అవుతున్నది. Remunerative గా ఉంటే Chief Engineer గారు sanction చేస్తారు.

[29th March 1956

## STARRED QUESTIONS.

*Supply to electricity to house lighting in Papanayudupeta etc., villages.*

669—

*1011 Q.—Sri P. SINGARAIAH .—Will the Hon. the Minister for Electricity and Social Welfare be pleased to state .

(a) whether any petitions were received by the Government for the supply of electricity to house lighting in Papanayudupeta and for Agricultural purposes in Papanayudupeta, Munagolepolem and Vikruthimala etc., villages; and

(b) if so, the action taken thereon ?

The Hon. Sri G. LATCHANNA :—

(a) A welcome address containing, among others, request for extension of supply of electricity to villages in Papanayudupeta firka has been received on 7—1—1956 from Yerpedu Ryots' Sangham.

(b) The matter is under consideration of the Government.

*Extension of Electricity for agricultural purposes to Papanaidupeta etc., villages.*

670—

*1067 Q.—Sri P. SINGARAIAH :—Will the Hon. the Minister for Electricity and Social Welfare be pleased to state :

(a) whether the Government propose to extend the Electricity for agricultural purposes to Papanaidupeta, Munagalapalem and Mahankalideviputtur from Kalahasti in Kalahasti taluk, Chittoor District ; and

(b) if so, when ?

The Hon. Sri G. LATCHANNA :—

(a) & (b): The matter is under consideration of Government.

[illegible]

[illegible]

*Civil Surgeons in the State.*

671—

*616 Q —Sri P. ANTHONY REDDI :—Will the Hon the Minister for Local Administration and Prohibition be pleased to state

(a) the number and names of Civil Surgeons in the State, who are entrusted to do major surgical operations ,

(b) what their names are ;

(c) the number of such operations done by them since the formation of the Andhra State ;

(d) the number of operations which were successful and the number of persons who died ,

(e) whether the Government will direct the Director of Medical Services to call for quarterly Statistical Reports of the Major Operations done by each District Surgeon and the mortality rate; and

(f) whether the Government are aware of the fact that surgical skill of the doctors is not considered while posting them to the District Headquarters Hospitals ?

The Hon. Sri A. B. NAGESWARA RAO :—

(a) & (b) 23 Civil Surgeons in the State are entrusted to do major surgical operations. They are the following :

(1) Dr. K. Chandra Rao, M.B.B.S., D.L.O.,

(2) Dr. J. S. Rao, M.B.B.S.,

(3) Dr. C. B. Ethirajulu, M.B.B.S.,

(4) Dr. R. K. Chettur, M B.B S , F I C.S ,

(5) Dr. M Munuswamy, B A , M S ,

(6) Dr. M Seetharamaswamy M S ,

(7) Dr D. Ramanath, Mc., M B B.S.,

(8) Dr H. M. Rao, M.B B S ,

(9) Dr. G. Thimma Reddi, M B B.S.,

(10) Dr. N. Govindarajulu, M B B S.,

(11) Dr. K. Rajamannar, L M. & S ,

(12) Dr. S S. Hussain, M S.,

(13) Dr. K. Kanakadurgamba, M.D , D G O ,

(14) Dr. K. Krishnamurthi, M.S ,

(15) Dr. B Shanmugeswara Rao, M S ,

(16) Dr. L. Suryanarayana, M.S.,

(17) Dr. N. Subhadra Devi, M D..,

(18) Dr. P. Narasimha Rao, M S ,

(19) Dr. H. M. Lazarus, M.D., MR.C.O G ,

(20) Dr. C. T. Hemachandran, M B.B.S , M.D.S (Lond).

(21) Dr A. B. Marakar, (1—10—1953 to 5—10—1953)

(22) Dr. C. Ratnavathy, M.B.B S , D G.O ,

(23) Dr. C. V. Ramani M.D., D.G O ,

(c) 9,263

(d) 9,014 and 249 respectively.

(e) The statistical reports will be called for, if necessary.

(f) Surgical skill of the Doctors is considered while posting them to the District Headquarters Hospitals

SRI P. GUNNAYYA :—అధ్యక్షా, పూజ్యులైన గోపాలరెడ్డి గారికి డాక్టరు అనే పేరు వచ్చిందిగదా, ఆయన ఆంధ్రదేశంలో రైతులకు ఏ ఏ ఉపకారమ్ము చేశారు? అవి ఏ విధంగా ఉపయోగ పడ్డాయి?

Mr. SPEAKER :—అది వైద్యంచేసే డాక్టరు. ఇది, విద్యాసంబంధమైన డాక్టరు అండీ.

[illegible]

THE HON. SRI A. B. NAGESWARA RAO — [illegible]

*Amount spent by the Government on State functions.*

672—

* 479 Q.—SRI N. C. SESHADRI :—Will the Hon. the Chief Minister be pleased to state :

(a) the amount spent by this Government on State functions for the year 1954–55 ; and

(b) the occasions on which such functions were held ?

THE HON. DR. B. GOPALA REDDI :—

(a) and (b), During the financial year from April 1954 to March 1955, a sum of Rs. 26,800 was spent towards State functions, such as the inauguration of the High Court and celebration of the 1st Anniversary of Andhra State, opening of New Secretariat Buildings, Independence and Republic Days.

*Amount spent for Prime Minister's visit in the State.*

673—

* 697 Q.—SRI B. RATNASABHAPATHY :—Will the Hon. the Chief Minister be pleased to state :

the total amount spent to make arrangements for the Prime Minister's visit to Kurnool and in the State ?

THE HON. DR. B. GOPALA REDDI :—

Rs. 22,735-1-9 which includes expenditure on items such as construction of a rostrum and provision of barricades for a public meeting at Kurnool, arrangements for gathering children from the various parts of the State and organising a children's Rally, hiring shamianas from Hyderabad in view of the limited accommodation at Kurnool and other miscellaneous items of expenditure on security and other arrangements in Guntur and Krishna Districts.

[29th March 1956

SRI S. VEMAYYA :—అధ్యక్షా, ఈ సందర్భంలో State guestsగా ఎంతమంది పిలిచినారు ?

THE HON. DR. B. GOPALA REDDI :—Notice sir.

SRI PILLALAMARRI VENKATESWARLU :—Security arrangements క్రింద ఎంతఅయిందో చెప్పగలరా ?

THE HON. DR. B. GOPALA REDDI :—Not in public interest. ఎక్కడెక్కడ ఎంతమందిని రిజర్వు పోలీసులను పెట్టారో, ఇవన్నీ కూడా చెప్పలేను

SRI PILLALAMARRI VENKATESWARLU :—ఎక్కడెక్కడ ఎంతమందిని పెట్టారో మేము అడగలేదు. అది చెప్పవలసిన అవసరంలేదు. దానికి గాను డబ్బు ఎంతఖర్చు అయిందని అడిగాము. దానిని స్పీకరుగారు కొంచెం మంత్రిగారిచేత చెప్పిస్తే బాగుంటుంది. వారు చెప్పడం evade చేస్తున్నారని నా ఉద్దేశం.

MR SPEAKER .—The Government is the best judge in in the matter.

SRI PILLALAMARRI VENKATESWARLU :—It is not correct to say that it is not in the public interest. The Chief Minister is entitled to say "I refuse to answer" but he cannot say that it is not in the public interest.

MR. SPEAKER :—We have to accept it when the Government says that it is not in the public interests.

*Amount incurred for laying the foundation stone to Nagarjunasagar.*

674—

*990 Q.—SRI M. SATYANARAYANA RAJU AND SRI P. GOPALAKRISHNA REDDI :—Will the Hon. the Deputy Chief Minister be pleased to state :

(a) the amount of expenditure incurred for the function of laying foundation stone to Nagarjunasagar ; and

(b) to what account that amount is debited ?

[29th March 1956

| | |
|---|---|
| [illegible] కు | రు. 1,400/- లు |
| సభ్యులు యితర తాత్కాలిక కట్టడాలు నిర్మించడానికి కూలి ఖర్చులు | రు. 650/-లు |
| టెలిఫోను, పోలీసు, హెల్తుయూనిట్ల జీప్పులకు, లాంచీలకు ఖర్చు | రు. 800/- లు |
| సామగ్రి, అవసరమైన రవాణా సౌకర్యాలకు | రు. 14,500/- |
| Launche బాడుగలకు | రు. 1,500/-లు |
| 3 వేల మంది పేదలకు సంతర్పణకు | రు. 4,500/- లు |

SRI VAVILALA GOPALAKRISHNAYYA :—Launches ఏర్పాటు చేసినపుడు కొందరు M. L. A. లకు ఒకవిధంగాను, కొంత మందికి ప్రత్యేకంగాను ఏర్పాటుచేసినారు. అట్లా ఎందుకు చేశారో తెలవిస్తారా ?

THE HON. SRI N. SANJEEVA REDDI :—అక్కడ హైద్రాబాద్ రాష్ట్రంవారు, మనం కలిసి arrange చేయవలసివచ్చింది. అప్పుడు వారు M.L.A. లకు మాత్రమే Launch చేసినట్లున్నారు తరువాత మనప్రక్కకు వచ్చినప్పుడు మన M.L.A. లకు వేరే arrangements చేయబడినాయి.

SRI VAVILALA GOPALAKRISHNAYYA :— మనప్రక్క arrangements చేసినదానిని గురించే నేను అడుగుతున్నాను. మనప్రక్కన 2 విధాలుగా arrangements చేశారు. District collectors కు వారికి ఒక విధంగాను M.L.A లకు వేరువిధంగానూ ఏర్పాటుచేసినారు. M.L.A. లు ఉన్న వైపుకు నెహ్రూగారు రారని ముందుగా చెప్పినారు. తరువాత గోపాలరెడ్డిగారు వెళ్లి "మా M.L.A. లంతా గొడవచేస్తున్నారు ఒకసారి రండి" అని తీసుకువస్తే నెహ్రూగారు రావడంజరిగింది. ఈ airagements సరిగా లేకపోవడంవలన మూర్తయ్యగారు, ఇంకా చాలామంది బాయ్కాట్ చేసి వెళ్లిపోయినసంగతి ప్రభుత్వమునకు తెలుసునా ?

THE HON. SRI N. SANJEEVA REDDI :—బాయ్కాట్ కు ఎక్కువగా మూర్తయ్యగారినే quote చేస్తూ ఉంటారు. Member in-charge of boycotts. అన్నట్లుగా ఉంది. Arrangements చేసినప్పుడు అన్నివసతులు కలిగేటట్లుగా చేయడానికి తగిన facilities లేవనేసంగతి గోపాలకృష్ణయ్యగారికి తెలుసును. పొలాల్లో చిన్నఊరు. అక్కడ ఒక shed వేసి ఈ ఏర్పాట్లన్నా చేయవలసి వచ్చినది. హైద్రాబాద్ ముఖ్యమంత్రి, ఇతరమంత్రులు ఇతర ఉద్యోగస్థులు,

[illegible] members [illegible]

[illegible]

SRI M. SATYANARAYANA RAJU :—[illegible]

THE HON. SRI N. SANJEEVA REDDI :—[illegible] ప్రత్యేకంగా చేయలేము [illegible] మంత్రిగారు ఇప్పుడే చెప్పినారు. [illegible]

SRI VAVILALA GOPALAKRISHNAYYA :—Arrangements చేయుటలో ఇబ్బంది ఉన్నదని నేను గ్రహించాను. ఏకువ [illegible] తగినట్లుగా arrangements చేయడానికి నాకేమి [illegible]. లేకున్నా [illegible] ఇక్కడకు రారు అనే discrimination చూపించినప్పుడు కొంచెం బాధగా ఉన్నది. ఇకముందైనా ఇటువంటివి లేకుండా సక్రమంగా జరిగేటట్లు చేస్తారని ఆశిస్తున్నాను.

(No answer)

SRI M. SATYANARAYANA RAJU :—మన Budget లోటుగా ఉన్నప్పుడు ఇటువంటి public functions ను గురించి అంత ఎక్కువ మొత్తాలను ఎందుకు ఖర్చుపెడుతున్నారు? ఇకముందైనా [illegible] ప్రయత్నంచేస్తుందా ప్రభుత్వం ?

THE HON. SRI N. SANJEEVA REDDI :—నాగార్జునసాగర్ లాంటిది దేశచరిత్రలో ఎప్పుడో ఒకసారి వస్తూవుంటుంది. దాని ప్రాముఖ్యత తెలుసుకోలేనివారు ఖర్చుపెట్టిన మొత్తం ఎక్కువ అనుకుంటారు. దాని importance కనుగొనగల్గినవారు తక్కువ అనుకుంటారు.

*Breached tanks in Obulam firka.*

675—

*270 Q.—SRI B. RATHNASABHAPATHY.—Will the Hon. the Minister for Revenue be pleased to state :

(a) whether the Government are aware that all the tanks in Obulam firka of Sidhout taluk had breached in the year 1949 as a result of heavy rains , and

(b) if so, when they will be repaired ?

THE HON. SRI K. CHANDRAMOULI —

(a) It is not correct to say that all the tanks in Obulam firka of sidhout taluk in Cuddapah district had breached in 1949 as a result of heavy rains Only the 'sluice channel' to the Tsandrapalli tank and the Mirabdullayapalli tank in S Ramapuram in Obulam firka had breached in 1949 as a result of heavy rains, and they were repaired at a cost of Rs. 3,905 and Rs 150 respectively

(b) Does not arise.

SRI S. VEMAYYA :— 1949 వ సంవత్సరములో చెడిపోయిన రెండింటినే repair చేయించా మంటున్నారు. ఆ repairs ఎప్పుడు పూర్తి చేశారండి ?

THE HON. SRI K. CHANDRAMOULI :—1949 వ సంవత్సరములో జరిగినటువంటి వాటిని వెంటనే take up చేశామండి. ఈ రెండూ తప్ప తక్కిన వన్నీ 2 సంవత్సరములలోనే పూర్తి చేశారు.

SRI G. RAMI REDDI :—సిద్ధవటం తాలూకా ఓబులం ఫిర్కాలో చంద్రపల్లి, గుటపల్లి అని పెద్ద చెరువులు తెగిపోయినాయి. దానికి నీరు ప్రవహించే కాలువకూడా ఉన్నది. 1949 సం॥ నుంచీ కూడ అపని జరగలేదు. ఇంతవరకూ అట్లాగే ఉంది. ఇప్పుడైనా మంత్రిగారు శ్రద్ధ తీసుకుంటారా ?

THE HON. SRI K. CHANDRAMOULI :— ఈ రెండు చెరువుల విషయంలోను action తీసుకోలేదు. దానినిగురించి scrutiny జరుగుతున్నది. అది P.W D. Engineer గారి దగ్గరనుంచి రావడంతోటే ఆలోచిస్తాము.

SRI G. YELLAMANDA REDDI :—అధ్యక్షా, ఆ చెరువు 1949 సంవత్సరములో తెగిపోతే ఇప్పటికి 7 సం॥ లు అయినది. దానిని బాగుచేయుటకు ఇంతకాలం తీసుకుంటే రైతాంగానికి ఎంత నష్టం వస్తుందో ప్రభుత్వంవారు ఇప్పటి కయినా గుర్తిస్తారా?

THE HON. SRI K. CHANDRAMOULI .—దానికి చాలా sources ఉన్నాయి. అన్నీ పూర్తి అయినాయి. ఇంకొక చిన్న విషయం ఉన్నది. దానివల్ల రైతులకేమీ ప్రమాదంలేదు. వ్యవసాయం బాగుగానే సాగుతున్నది. దానివలన పంట నష్టమేమీ లేదని reports ఉన్నాయి.

SRI B. RAMA REDDI :—[illegible]

THE HON. SRI K. CHANDRAMOULI :—[illegible]

*Extension of electric power to Vidupunkal Panchayat*

676—

*1106 Q.—SRI S. NARAYANAPPA :—Will the Hon. the Minister for Electricity and Social Welfare be pleased to state:

(a) whether any representation has been made to the Government to extend electric power from Guntakal to Vidupunkal Panchayat (via.) Manchanahall Panchayat,

(b) if so, when this representation was made,

(c) the action taken thereon ; and

(d) when this extension scheme will be executed?

THE HON. SRI G. LATCHANNA :—

(a) The answer is in the negative.

(b) Does not arise.

(c) Does not arise.

(d) A scheme for extension of electricity supply to Vidupunakal and 12 other Villages including Hanchinahalli is under formulation. Hence the question of its execution will arise only after it has been found to be remunerative and sanctioned.

(a) గుంతకల్లు, హంచినహాల్లి మీదుగా విదుపునకాల్ పంచాయతీకి విద్యుచ్ఛక్తి కావాలని representation రాలేదు. అందువలన (b) and (c) ప్రశ్నలకు సమాధానము చెప్పుటకు తావులేదు.

(d) విదుపనకల్ మొదలైన 12 గ్రామములకుగాను ఒక ప్రత్యేక స్కీము తయారు చేస్తున్నారు. అది త్వరలోనే పూర్తి కాబోతున్నది.

3

*Construction of a cause-way over the Galeru.*

677—

*709 Q —Sri E. AYYAPU REDDI :—Will the Hon. the Minister for Local Administration and Prohibition be pleased to state :

(a) whether any representation has been made to the Government by the people of Bandi-Atmakur Village, Nandyal taluk, for the construction of a cause-way over the Galeru, and

(b) the action taken on the memorandum submitted ?

The Hon Sri A B NAGESWARA RAO —

(a) The answer is in the negative.

(b) Does not arise.

ఈ గాలేరు నది బండి ఆత్మకూరు, నంద్యాల రోడ్డుకు మధ్యగా ఉన్నది. ఆత్మకూరు నుంచి నంద్యాల రోడ్డుకు మధ్య ఒక రోడ్డు వేయాలనే ఉద్దేశ్యం ఉన్నది. ఈ రోడ్డు బండి ఆత్మకూరు గ్రామమునుంచి వెడుతుంది.

Sri E. AYYAPU REDDI:—గాలేరునది బండి ఆత్మకూరు గ్రామమునకు సమీపంలోనే ప్రవహిస్తున్నది. ఈ K. C. Canal యొక్క నీటి నంతను గాలేరు నదిలోకి వదులుతున్నారు. గ్రామ ప్రజలు ఈ నదిని దాటి పొలములకు వెళ్లుటకు అవకాశం లేదు. ఇంతవరకు రూ 10,500 క్యూసెక్కుల నీరు మాత్రం గాలేరు నదిలోనికి వదులుతున్నారు. ఇక ముందు నుంచి 3 వేల క్యూసెక్కుల నీరు వదలుతారు. అందువలన రైతులు ఆ నదిని దాటి తమ పొలములకు వెళ్లుటకు సంవత్సరమునకు 10 నెలలు అసాధ్యంగా ఉంటున్నది. రైతులు తమ పొలములను సాగు చేసుకోవడం దుస్సాధ్యమవుతుంది అందువలన బండి ఆత్మకూరునకు కాకుండా ఇతర గ్రామానికి కలిపితే బాగుంటుంది. ఈ విషయమై ప్రభుత్వంవారు తగిన శ్రద్ధ తీసుకోవలసి యున్నది.

The Hon. Sri A. B NAGESWARA RAO.—గౌరవ సభ్యులు చెప్పిన వివరములన్నింటినీ ఒక విజ్ఞాపన పూర్వకంగా వ్రాసి పంపినట్లయితే దానిని గురించి ఆలోచిస్తాము.

Sri E. AYYAPU REDDI :—ఈ వివరములన్నింటిని Deputy Chief Minister గారికి ఇదివరకే అందజేసినాము. K. C. Canal లో 3 వేల

వ్యాపారస్తుల నిరు నడపటకు పూర్వమే ఈ question మీద కమిటీలో, ఇంకా ఏవైనా చర్య తీసుకొనుటకో ప్రభుత్వం ప్రయత్నిస్తుందా?

THE HON. SRI A. B. NAGESWARA RAO :—మీరు ఉపముఖ్య మంత్రిగారికి వివరాలన్నింటిని ఇదివరకే తెలియజేశారు. కనుక వారు దీనిమీద చర్య తీసుకుంటూ వున్నారు.

SRI P. VENKATASUBBAYYA :—గత వారం రోజుల నుంచి question hour ఒక గంట లోపుగానే ముగిసిపోతోంది. Questions లేక పోవుటవలననా? లేక Departments నుంచి answers రాకపోవుటవలన ఇట్లు జరుగుతున్నదా?

MR. SPEAKER :—ఇప్పటికి 6,7 వందల ప్రశ్నలకు answer చేశాము. ఇంకా 200 పైగా questions ఉన్నాయి. మా వద్ద answers కొద్దిగా ఉండటంవలన అన్ని రోజులకు distribute చేస్తున్నాము.

[Note :—An asterisk at the commencement of a speech denotes revision by the Member.]

## II BUSINESS OF THE HOUSE

### *Re : Discussion on the States Reorganization Bill.*

SRI L. LAKSHMANA DAS :—ఈ S. R. C. Report మీద ఎప్పటివరకు ఇక్కడ చర్చ జరుగుతుందో తెలిసినట్లయితే దానినిబట్టి ఢిల్లీ వెళ్లవలసినవారు వెళ్ళిరావచ్చునేమో! లేక ఇది పూర్తిచేసుకొని ఢిల్లీ వెళ్లుటయో నిర్ణయించుకుంటాము. కాబట్టి వెంటనే తెలియజేస్తారా?

THE HON DR. B GOPALA REDDI :—మనం అనుకున్న ప్రకారంగా 2,3, 4, 5, తేదీలు దీనినిగురించి చర్చజరిగించాలని మా అభిప్రాయం. అవసరమైతే, లక్ష్మణదాస్ గారికి, మిగిలిన సభ్యులకు కావాలంటే ఇంకొకరోజు పొడిగించుకొనవచ్చును. మనకు ఇంకా కొన్ని బిల్లులున్నాయి. అవన్నీ పూర్తిచేసుకొనుటకు అవకాశముంటుంది. కాబట్టి 6 వ తేదీవరకు పొడిగించినట్లయితే మంచిదేమో. ఢిల్లీ వెళ్ళినవారు 2 రోజులు అక్కడఉండి తిరిగి బయలుదేరి 3 వ రోజుకు ఇక్కడకు చేరవచ్చును; 5 రోజులూ అక్కడ ఉండవలసిన అవసరంలేదనుకుంటాను.

SRI L. LAKSHMANA DAS :—అక్కడ 31 వ తేదినుంచి ఉన్నది, 3 వ తేదయినా అక్కడ బయలుదేరితేగాని 5 వ తేదినాటికి ఇక్కడకు రాలేము. అందుకని 31 వరకుకూడ ఇందులో participate చేయాలనే ఉద్దేశ్యంఉన్నది.

MR. SPEAKER :—The discussion will be continued on 5th April

THE HON. D. B. GOPALA REDDI :—అవసరమైతే 5 వ తేది మధ్యాహ్నంకూడ సమావేశం పెట్టుకొనవచ్చును ఇంకా కావాలంటే 6 వ తేది కూడ afternoon meeting పెట్టుకొనవచ్చును.

## III. POINT OF INFORMATION

### *Re. Publication of the Report of the Select Committee on the Madras Estates Land (Andhra Amendment) Bill*, 1955

SRI VILLALAMARRI VENKATESWARLU :—అధ్యక్షా! ఈనాంబిల్లును Select Committee వారు amend చేసిన విధంగా గెజిట్‌లో publish అయింది Select Committee report, Minute of dissent, అవేమి publish కాలేదు దానిని మా కింతవరకు distribute చేయలేదు Select Committee report, అంతా publish చేయకుండా బిల్లు form లోనే Gazette లో publish చేయడంఅనేది ఇంతవరకు ఎక్కడా ఏ Legislature చరిత్రలో జరగలేదు. Whole report, Minute of dissent తో కూడా publish చేస్తే ఈ బిల్లు చదువుకొన్నప్పుడు మా Minute of dissent కూడా చదువుకొనడానికి వీలవుతుంది. మాకుకూడా న్యాయం కలుగచేసినటువంటి వాళ్లు అవుతారు. అలాకాకుండా ఒక్కబిల్లుమాత్రమే publish చేయడం సరికాదని ఈ విషయంలో వీరు Out of the way పోయారనే మా ఉద్దేశ్యము, అది మీదృష్టికి తీసుకువస్తున్నాను. గెజిట్‌లో, Report, minute of dissent అంతా publish చేసేటట్లు చూడాలని మిమ్ములను కోరుతున్నాను.

THE HON. SRI K. CHANDRAMOULI :—Select Committee report ఉన్నది ఉన్నట్లుగా publish చేయాలనిలేదు Cabinet ఆలోచించ వలసిన అవసరాలుకూడా ఉంటూఉంటాయి. ఒక్కొక్కసారి కొన్ని fundamental changes జరుగుతాయి అందువలన వెంకటేశ్వర్లు గారు అనుకొన్నట్లుగా చెడ్డ ఉద్దేశ్యంతో జరిగినటువంటిదికాదు. దానిని ఆలోచించిన తరువాతనే Publish చేయాలి.

SRI PILLALAMARRI VENKATESWARLU :—Cabinet ఆలోచించి బిల్లును గెజిట్‌లో publish చేశారు. బిల్లును ఆలోచించకుండా report ను మాత్రమే ఆలోచిస్తున్నవన్నమాట

MR. SPEAKER —What you want is the Select Committee Report ? Is it not ?

SRI PILLALAMARRI VENKATESWARLU :—The report has to be published in the Gazette now, because they have published the Bill

MR. SPEAKER .—You want that the report should be circulated to the members, is it not ?

PILLALAMARRI VENKATESWARLU .—The bill is published in the Gazette as amended by the Select Committee. But the report was not published. The bill is a part of the report. కనుక రెండుకూడా publish చేయాల్సి ఉంటుంది.

THE HON. SRI N. SANJEEVA REDDI :—The report cannot be published in the Gazette

SRI PILLALAMARRI VENKATESWARLU :—Then why have you published the Bill ?

THE HON. SRI N. SANJEEVA REDDI :—After all, Bill is different from the report.

THE HON. SRI K. CHANDRAMOULI :—బిల్లుకు, రిపోర్టుకు ఏమి సంబంధంలేదు

SRI PILLALAMARRI VENKATESWARLU :—Bill is a part of the report.

THE HON. SRI K. CHANDRAMOULI :—కాదు.

SRI PILLALAMARRI VENKATESWARLU :— ఈ చిన్న విషయం మీరు కాదంటే ఎట్లా కుదురుతుంది ?

Gezette లో సాధారణంగా ఏ బిల్లు అయినాసరే public opinion కొరకు తీసుకొనే క్రొత్తబిల్లు అయినప్పుడు publish చేస్తారు. Select Committee Report ను publish చెయ్యకుండా ఉండడం సరికాదు. It must go through the House. ఈ విషయంగురించి Parliamentary debates లో గాని, ఇంకా ఏ అసెంబ్లీ debates గాని చూడండి. Select Committee Report ను సభ

ముందు పెట్టకుండా Gazette లో publish చేయడం ఇక్కడతప్ప ఇంకెక్కడా జరగలేదు. Publish చేస్తే report అంతా publish చెయ్యాలి. ఏ rules ప్రకారం ఈవిధంగా బిల్లుమాత్రమే Gazette లో publish చేశారో చెప్పండి ?

THE HON. DR. B. GOPALA REDDI :—అధ్యక్షా, ఈ విషయం తమరు పరిశీలించవచ్చు. తమరు చెప్పినట్లుగా మేము చేయడానికి మాకేమి ఆక్షేపణలేదు. ఈ report ను Gazette లో publish చేయాలని Speaker గారు ruling ఇస్తే తప్పకుండా ఆవిధంగా చేస్తాము. అది అంతాకూడా Speaker గారి ruling కే వదిలివేస్తాము.

SRI PILLALAMARRI VENKATESWARLU :—అధ్యక్షా, అసలు ఏ rule ప్రకారం Select Committee Report నుంచి బిల్లును విడదీసి Gazette లో publish చేశారో చెప్పండి. Rules లేకుండా పరిపాలనచేస్తామంటే చేయండి.

THE HON. DR. B. GOPALA REDDI :—అధ్యక్షా ! ఇందులో వెంకటేశ్వర్లుగారు ఆవేశపడవలసిన అవసరం ఏమిలేదు. వారు speaker గారికి appeal చేశారు. మేముకూడా speaker గారు ఏమిచెపితే అది చేయడానికి సంసిద్ధంగా ఉన్నాము మన ఢిల్లీపార్లమెంటులోగాని, లేక ఇంతకుముందు జరిగినటువంటి సాంప్రదాయం ప్రకారంగా గాని పరిశీలనచేసి ఎట్లా చెయ్యమంటే అట్లా చేయడానికి మాకేమి ఆక్షేపణలేదు.

SRI PILLALAMARRI VENKATESWARLU :—The Government have no right to publish the Bill with the Select Committee's Report. They have gone out of the way.

MR. SPEAKER :—Rule 92 of the Assembly Rules says : "The report, the minutes of the proceedings of the Committee as approved by the person presiding and, if the Bill has been amended, the Bill as amended by the Committee, shall be printed and copies furnished to each Member of the Assembly."

SRI PILLALAMARRI VENKATESWARLU :—What you have read is in my favour, Sir, అందులో ఏమున్నదంటే Report, Bill ఇవి Members అందరికి అందచేయాలి. Report లోని కొన్ని భాగాలనే publish చేయాలి అని దానిలో ఉన్నది. అసలు మీరు Report అందజేయకుండా, బిల్లు ఎట్లా publish చేసినారు ?

MR SPEAKER :—What is the direction of the Committee here?

SRI VAVILALA GOPALAKRISHNAYYA :—అధ్యక్షా! నేను కొంచెం explain చేయాలి.

MR. SPEAKER —I learn from the office that the report also has been published You please see it and bring it to my notice

## IV MESSAGE FROM THE GOVERNOR.

### Re : The Andhra Appropriation Bill, 1956

MR SPEAKER —I have to announce that the following message dated 23rd March, 1956 has been received by me from the Governor of Andhra :

"In pursuance of Article 207 clause (1) of the Constitution of India, I, Chandulal Madhavalal Trivedi, Governor of Andhra, hereby give my recommendation to the introduction in the Andhra Legislative Assembly of the Andhra Appropriation Bill, 1956, and in pursuance of clause (3) of the said Article, I also recommend to that Assembly the consideration of the said Bill."

## V. GOVERNMENT BILLS

### The Andhra Appropriation Bill, 1956.

THE HON. DR. B. GOPALA REDDI —Sir, I beg to introduce the Andhra Appropriation Bill, 1956 and move that the Bill be taken into consideration at once.

అధ్యక్షా, ఇది రెండు clauseల బిల్లు. దీంట్లో ఒక schedule మాత్రం ఉన్నది కాని రెండవ తేదీన ప్రారంభమైన Budget సమావేశముయొక్క సారాంశం ఈ బిల్లులో ఉన్నది. 2 వ తేదీన budget ప్రవేశపెట్టడం, తరువాత 4 రోజులు చర్చ, 12 రోజులు budget demands పై చర్చ, మధ్యలో supplementary demands పై చర్చ, ఇవన్నీ జరిగినతరవాత ఈ చర్చలయొక్క సారాంశమే ఈ బిల్లులో నమోదు పరపబడుతున్నది. అంటే ఈ శాసనసభలోని 19 రోజులచర్చ సారం ఇది. ఈ క్షీరసాగరమథనంలో వచ్చినటువంటిది నవనీతమనైనా చెప్పవచ్చు లేకపోతే అమృతం అనైనా చెప్పవచ్చు.

Sri Dr. B. Gopala Reddi] [29th March 1956

ఇది వచ్చేసంవత్సరమునకు సంబంధించి గవర్నమెంటువారు పెట్టబోయేటటువంటి ఖర్చు. Revenue ఖాతామీదగాని, loans మీదగాని, capital expenditure మీదగాని పెట్టేటటువంటి ఖర్చు అంతాకూడ ఈ schedule లో సమోదుపరచబడింది. మొదటి పంచవర్ష ప్రణాళిక ఇక రెండు దినములలో పూర్తి అవుతున్నది. ద్వితీయ పంచవర్ష ప్రణాళిక April ఒకటవతేదీనుంచి ప్రారంభం కాబోతున్నది. ఆ అయిదు సంవత్సరములలో మొదటిసంవత్సరానికి సంబంధించి ఈ ప్రభుత్వమువారు ఏమి చేయదలచుకొన్నారో, ఏఏ విషయాలు తలపెట్టినారో, ఈ చర్చల ఫలితంగా గవర్నమెంటువారు ఏవేవి ఈ బడ్జెటులో వేసుకొన్నారో అవన్నీ కూడా దీంట్లో ఇమిడిఉన్నవని చెప్పవలసియున్నది. ఇది చాలా ప్రాముఖ్యమైన విషయము ఇప్పుడు రెండవ పంచవర్ష ప్రణాళిక ప్రారంభములో ఉన్నాము. అనేక విషయాలు తలపెట్టుతున్నాము. పెద్దసంకల్పాలతో, ఉద్దేశాలతో దేశము ముందుకు పోవడానికి ప్రయత్నం జరుగుతున్నది. దేశములో అంతర్భాగమైనటువంటి మనము కూడ, ఈ రెండుకోట్లచిల్లరమంది ఆంధ్రులకు సంబంధించి, ఏఏవిషయాలు తలపెట్టుతున్నామనేది దీంట్లో సూక్ష్మంగా చెప్పబడింది. అంకెలలో చెప్పినప్పటికి కూడ, దీంట్లోఉన్న ఇతిహాసమంతా చూడవలెనని కోరుతున్నాను. అంతేగాక, బహుశా, ఈ ఆంధ్ర అసెంబ్లీలో ఇది కడపటి Appropriation Bill కావచ్చు, అవుతుందనే అందరముకూడ ఆశిస్తున్నాము. వచ్చే ఆరుమాసములలో, విశాలాంధ్ర, ఆంధ్ర-తెలంగాణా అనేపేరుతోనో లేక మరోపేరుతోనో, స్థాపనకావడం జరుగుతుంది. అందువల్ల ఈ 11 జిల్లాలకు సంబంధించినంత వరకు మరల వేరే Appropriation Bill ఈ అసెంబ్లీలో లేకపోవచ్చు. అందువల్ల, ఇది ఒక రకంగా వెనుకటి చరిత్ర, ముందు చరిత్ర అంతాకూడా జ్ఞప్తికి తీసుకొని వచ్చేటటువంటి విషయమేమో అనిపిస్తున్నది అంతేగాక, ఈ 2½ సంవత్సరాలలో మన గవర్నమెంటుయొక్క ఆదాయముకూడా కొంతవరకు పెరిగింది, కేవలం మన taxation వల్లనే కాకుండా మనకు మామూలుగా వచ్చేటటువంటి ఆదాయము, sales tax వల్లగాని, Forest Department లోనుంచిగాని, Registration Department లో నుంచిగాని లేక Electricity Department నుంచిగాని, వచ్చేటటువంటి మన ఆదాయము పెరుగుతూ ఉన్నది. అంతేకాక ఈ సంవత్సరం వేసుకొన్న పన్నులవల్లకూడ మన ఆదాయము పెరిగింది. 1954-55 వ సంవత్సరం accounts ప్రకారం మన ఆదాయం 19 కోట్ల 82 లక్షల రూపాయలైతే, 1955-56 (Current year) లో revised estimates ప్రకారము 22 కోట్ల, 40 లక్షల రూపాయలైనది. మళ్లీ 1956-57, వచ్చే సంవత్సరం, యొక్క బడ్జెట్ అంచనా ప్రకారం

29th March 1956] [Dr. B. Gopala Reddi

23 కోట్ల, 71 లక్షలు అవుతుంది. రెండు సంవత్సరముల క్రితము, అంటే 1954-55 లో 19 కోట్లు, 82 లక్షలు ఉంటే, 1956-57 సంవత్సరం వచ్చేసరికి 23 కోట్ల, 71 లక్షల అవుతున్నది, అంటే ఈ రెండు సంవత్సరాలలో దాదాపు 4 కోట్ల రూపాయలు మన ఆదాయము పెరిగింది. అట్లే expenditure కూడా 1954-55 లో 25 కోట్లువుంటే 1955-56 లో 26 కోట్ల, 37 లక్షలున్నా, 1956-57 లో 26 కోట్ల, 95 లక్షలు అవుతున్నది. అంటే ఈ సంవత్సరంకూడ ఇంచుమించు అదే ఖర్చు ఉన్నది. అయినప్పటికికూడా, పంచవర్ష ప్రణాళికలో మిగతా 4 సంవత్సరములలో ఇంకా ఎక్కువ కాగలదనీ, దానికి కావలసిన ఆర్థిక స్తోమతుకూడా మనము సంపాదించుకొని, మన tempo of work ను ఇంకా ఎక్కువ చేసుకొనే విషయంలోకూడ మనము అభివృద్ధి సాధించుకోవచ్చునేమో అనిపిస్తున్నది. అందువల్ల ఈ 2 సంవత్సరముల యొక్క సమీక్షే కాకుండా ఈ అంకెలలో ఇంకా అనేక విషయాలున్నాయి. ఈ సంవత్సరములో చూడండి. నిన్ననో, మొన్ననో, D. P. I. గారు చెప్పతూ వచ్చారు. 1955 మార్చిలో మన రాష్ట్రంలో 45 వేలమంది విద్యార్థులు School Final Examination కు పోతే, 1956 మార్చిలో 51 వేలమంది appear అయినారని చెప్పారు. అంటే, ఒక సంవత్సరంలో 6 వేలమంది school final పరీక్షకు కూర్చోడానికి తయారైనారన్నమాట, అంటె, సూక్ష్మంగా మన ఆంధ్ర దేశములో జరుగుతున్నటువంటి అభివృద్ధినిగురించి తెలుసుకోనేందుకు ఈ విషయము చెప్పతున్నాను. D. P. I. గారు ఇంకొకటి చెప్పారు. ఈ తడవ, School Final examination జరగడంలో ఎక్కువ కష్టాలేమి లేకుండానే జరిగినాయని చెప్పారు. కడప విషయంలో మాత్రము ఏదో ఒక incident జరిగిందన్నారు. ఇప్పుడా విషయము ఉల్లేఖించను. కాని ఎక్కువగా అలాంటి ఇబ్బందులు లేకుండా ఈ పరీక్షలు జరిగినాయని వారు చెప్పారు. కొన్నిచోట్లమట్టుకు Police బందోబస్తుతో ఇవి జరుపవలసి వస్తున్నది. ఇకముందు అటువంటి పరిస్థితులుకూడ లేకుండా ఉంటె, మన విద్యార్థులకి గాని, మన దేశానికి కాని క్షేమంగా ఉంటుందని నేను ఆశిస్తున్నాను. అందువల్ల, electricity విషయంలో, ఇది కొన్నికొన్ని గ్రామాలకు రావడం, ఒక్కొక్క department లో ఎంత ఖర్చు అయినది, ఈ విషయాలన్నీ చూచుకొంటూ ఉంటె, తప్పకుండా మనము కొంత అభివృద్ధిని పొందుతున్నామని అనిపిస్తుంది. గౌరవ సభ్యులయొక్క ఉపన్యాసాలు, లేక స్థానికంగా వారి నియోజక వర్గాల్లో జరుగుతున్న విషయాలు వింటూఉంటే, ఇంకా సాధించవలసిన ప్రమాణము చాలా ఉన్నదేమోనని, ఇప్పుడిప్పుడే ముందడుగువేస్తున్నామే

మోనని, ఇంకా పోవలసిన యోజనములు చాలా ఉన్నాయేమోనని అనిపిస్తుంది. కాబట్టి ఒకేసారిగా, 5, 10 సంవత్సరములలో జరిగేదికాదు ఇది. నిరంతరంగా ఈ అభ్యుదయ ప్రయాణాన్ని మనము సాగించి దేశంలో ఒక అభ్యున్నతిని తీసుకు రావాలి. ఈ పంచవర్ష ప్రణాళిక ద్వారా నిజంగా, సాంఘికంగా గాని, ఆర్థికంగా గాని ఒక శాంతి విప్లవము వస్తుంది అనేటటువంటి ఆశ నాకు పూర్తిగా ఉన్నది. అది మనకు స్పష్టంగా కనపడక పోవచ్చును. మిట్ట మధ్యాహ్నం వెలుగుమాదిరి కనపడక పోవచ్చును. కాని క్రమేణ నెమ్మది, నెమ్మదిగా తెలియకుండానే, అదృశ్యంగానే ఆ శాంతి విప్లవము మన కాలములో వస్తున్నది. ఈనాడు మనము ఈ land ceilings మొదలైనవి కోరతున్నామంటె వాటియొక్క ఉద్దేశమేమిటి ? దేశంలో కొత్తగా వస్తున్నటువంటి దృక్పథముయొక్క సూచనగా దాన్ని తీసుకోవాలిగాని మరొకటికాదు. ఆస్తి ఉన్నట్లయితే, అది తమ కొడుకులకో, మనుమలకో ఇచ్చి పోవాలి అనేటటువంటి దృక్పథం మారి, ఈనాడు మనకు ఎక్కువగా ఉన్నదంతా కూడ సంఘముయొక్క అభ్యున్నతికోసంగా ఇచ్చుకోవాలి అనేటటువంటి నూతనమైన వాతావరణము వస్తున్నది. అందువల్ల కూడ మనము ముందుకు పోతున్నామేమో అని చెప్పడానికి సాహసించవచ్చు. ఇది ఈ రెండు క్లాజుల బిల్లులోని ఆకాంక్ష, ప్రజలయొక్క కోరిక, నాగార్జునసాగర్ ప్రాజెక్టు లాంటి పెద్దపెద్ద విషయాలన్ని కూడ ఈ రెండు క్లాజుల బిల్లులో ఉంటున్నాయి. మనము చెయ్యబోయే local development works, national extention schemes, ఈ ప్రయత్నము అంతాకూడా ఈ బిల్లులోనే ఉన్నది. కాబట్టి వచ్చే 12 మాసాల లోపల మన 11 జిల్లాలలో జరిగేటటువంటి కార్యకలాపాలన్నికూడ ఈ చిన్న బిల్లులో ఉన్నాయని చెప్పవచ్చును. ఎందుకంటె, అన్ని departments కు సంబంధించి, 79 కోట్లు అంటె, ఆ 79 కోట్లు మనము actual గా ఖర్చు పెడుతున్నామనే ఉద్దేశంకాదు. అయిదు మార్లు అయిదు రూపాయిలు తీసుకొన్నా, మరల ఇచ్చివేసేటప్పుడు అది 25 రూపాయల క్రింద ఇక్కడ చూపించవలసి యుంటుంది. మన treasury నుంచి పొయ్యేది దమ్మిడి అయినా, అదికూడ లెక్క క్రింద వస్తుంది. మన treasury లో నుంచి ఎన్ని దమ్మిడీలు పోతుందో, అన్ని దమ్మిడీలుకూడ ఈ appropriation bill లోకి రావలసి యుంటుంది. మనము పెట్టబోయేటటువంటి ఖర్చు అంతాకూడ 40, 50 కోట్ల కంటే ఎక్కువ కాకపోయినప్పటికికూడా, Appropriation Bill లో మాత్రము 79 కోట్ల రూపాయలు కనబడతున్నది. అందువల్ల ఈ appropriation bill అనేది ఒక చారిత్రాత్మకమైన ఘట్టమని అనుకోవాలి గడచిన సంవత్సరమేమో నయిపోయింది. వచ్చే సంవత్సరమునకు ఈ నాడు మనం తలపెట్టేటటువంటి

విషయాలన్ని ఇందులో ఉన్నాయి విశాలాంధ్ర రావడం, నాగార్జునసాగర్ ప్రాజెక్టు వగైరాలు మనం ప్రారంభించబోవడం, తుంగభద్ర Hydro Electric Works, పూర్తి చేసుకోవడం, మాచ్‌ఖండ్ ఇంకా అభివృద్ధి చేసుకోవడం ఇటువంటి వన్నీ, చిన్నవీ, పెద్దవీ అన్నీకూడ ఈ appropriation bill క్రిందనే వస్తాయి. అందువల్ల ఇది ఒక రకమైన నూతన ఘట్టమేమో అనిపిస్తుంది. అందులో ద్వితీయ పంచవర్ష ప్రణాళిక ప్రారంభం కాబోతున్నది. అదికూడ ఒక చారిత్రాత్మకమైన విషయం అనుకొంటాను. ఈ appropriation bill 19 దినాలు జరిగిన చర్చల ఫలితం కాబట్టి ఈనాడు దీనినైనా కొంచెము మందహాసంతో ఆమోదించవలెనని నేను కోరుతున్నాను. ఇంతకుముందు ఎన్ని ఆగ్రహాలు చూపించినా, ఈనాడైనా, చర్చల ఫలితంగా వచ్చిన దీనినైనా సంతోష పూర్వకంగా సభ్యులు ఆమోదిస్తారని ఆశిస్తున్నాను.

SRI PILLALAMARRI VENKATESWARLU :- అధ్యక్షా, ఈనాడైనా సంతోష పూర్వకంగా ముఖ్యమంత్రిగారు ఇంకా ఎక్కువ డబ్బు ఖర్చు పెట్టడానికిముందుకు వస్తారని నేనుకూడ ఆశిస్తున్నాను. ఈ appropriation bill మనము చూచినప్పుడు, కొన్ని ముఖ్యమైన విషయాలు మన దృష్టికి వస్తాయి. ముఖ్యమంత్రిగారు వాటినిగురించి చెప్పారు. 1954-55 నుంచి మన ఆదాయం ఏవిధంగా 4 కోట్లవరకు పెరిగిందీ, అందులో కేవలం ఒక రెండు కోట్ల 15 లేక 50 లక్షలు మాత్రమే కొత్త పన్నుల ద్వారా వచ్చిందని మిగిలిన ఒక కోటి, 60 లక్షలు మనకు వచ్చినటువంటి ఆదాయమని చెప్పబడింది. ఈ sales tax వసూలును కూడ మనము ఖచ్చితంగా అమలుజరిపితే, కనీసం రెండు కోట్లు అదనంగా మన state ఆదాయంవచ్చే అవకాశాలు ఉన్నాయి. అందువల్ల Sales Tax Enquiry Committee, తమయొక్క పర్యటన పూర్తిచేసి ఒక నివేదికను ఇచ్చినట్లయితే, వారి సూచనలను ప్రభుత్వము అమలుజరిపి ఈ రెండు కోట్ల రూపాయల అదనపు ఆదాయాన్ని తెచ్చుకోవడానికి వీలుంటుంది.

దానినిబట్టి ఆరుకోట్లరూపాయలు అదనపు ఆదాయము మనము పొందగలిగినవారమవుతాము అని దానితోనే తృప్తిచెంది, యికమీదట యిలాంటి అదనపు పన్నుల బిల్లులను తీసుకునిరాకుండా ఉంటారని నేను ఆశిస్తున్నాను.

THE HON. DR. B. GOPALA REDDI :—అయితే deficit పూడకుండా వుండాలనా?

[29th March 1956

SRI PILLALAMARRI VENKATESWARLU :— Deficit ఎప్పుడూ పూడకుండా ఉండాలనే మా కోరిక మనకు వచ్చే ఆదాయమును కంటే, ఎక్కువ ఖర్చు చేయాలనే మా కోరిక. అయితే ఎక్కడనుంచి ఖర్చుచేస్తాము ? అప్పుచేస్తే. ముందుతరాలవారిమీద ఎక్కువగా పన్ను వేయ వలసివస్తుంది. భావితరాల వారినే ఎక్కువగా కష్ట పెట్టవలసి వస్తుంది అని చెప్పారు. సాంఘికంగా మన ప్రజానీకము యొక్క outlook ఏవిధముగా మారుతుందో, ఆవిధముగా పరిస్థితులుకూడ మారవలసియున్నది. మనము బ్రతుకుతున్నది కేవలము మన బిడ్డలకోసమే కాదు, మన బిడ్డలసంతతి ముందుముందు ప్రభుత్వమే చూచుకుంటుంది, అటువంటి దృక్పథము ప్రజలలో రానురాను వ్యాపిస్తున్నది కాబట్టి మనకు భయపడవలసిన పనిలేదని మంత్రిగారు అన్నారు. అందుకే కాబోలు, గోపాలరెడ్డిగారు తనకు ఉన్న ఆస్తి అంతా పోతుందేమోనని ఏమాత్రముకూడ భయపడకుండా ఉన్నారు. Land Reforms తీసుకుని రావాలనే దృక్పథము అన్నిచోట్లలోనూ ఉన్నదనే విషయము మంత్రిగారి దృష్టికి తెస్తున్నాం. అందువల్ల యీరోజున సాంఘికంగా ఒక బ్రహ్మాండమైన విప్లవం శాంతి మార్గాలలో వస్తే మరీ సంతోషమే. ఆవిధంగా రావాలనే మా అందరికోరిక. ఆవిధముగా రావటానికి ప్రభుత్వములో ఉన్న మీరందరూ ప్రయత్నించండి. మేము కూడా మీకు సహాయముచేస్తాము. మనమందరము అన్నివిధములుగా పురోగమిస్తాము. కాని ఆమార్గమనేది ఏది అని మనము చూచుకోవాలి. దానికి ఉన్నటువంటి ఆటంకాలు మనము తొలగించాలి అందువల్ల బడ్జటువిషయములో మన financial condition ఎట్లా ఉన్నది, మనము చూచుకుంటే, మనము చాలా sound basis లోనే ఉన్నాము, అనే విశ్వాసము ఆర్థికమంత్రిగారికి ఉండాలని నా కోరిక. మనకు ఆంధ్రరాష్ట్రము వచ్చినతరువాత 1954-55 వ సంవత్సరములో సుమారు నాలుగుకోట్లరూపాయల ఆదాయము మనకు పెరిగింది. ఇప్పుడు మనము యీ sales tax వసూలుచేసే విధానముకూడ కట్టుదిట్టముగా జరిపించినట్లయితే, మనకు కనీసము రెండుకోట్లు అయినా యింకా ఆదాయంవస్తుందనేది. అప్పటికి అంతాకూడచేరి మనము సుమారు ఆరుకోట్లు ఆదాయము అదనముగా సంపాదించ గలుగుతాము. ఇప్పటికే మనకు యీ పన్నుల భారము ఎక్కువగా ఉన్నదని అందరికినీ తెలుసు. మనది వ్యవసాయదేశము కావడమువల్ల, మనకు వచ్చే ఆదాయము ఆ దృష్టితో చూస్తే, చాలా తక్కువనే చెప్పవలసివున్నది. మనముకూడ ఏ బొంబాయిలో మాదిరిగా యిక్కడ మన రాష్ట్రములో నాలుగుమిల్లులు పెట్టుకుని, యింకా ఎక్కువ లాభం చూపించమంటే, చూపించవచ్చును ఆ మిల్లులన్నీ బొంబాయిలో పెట్టి,

యిక్కడ మీకు ఆదాయములేదు. మీ State చాలా పేదస్థితిలో ఉన్నది. మీకు ఎంత డబ్బుయిచ్చినా, మీకు ఖర్చుపెట్టుకోవడం మీకు చేతకాదని కేంద్ర ప్రభుత్వం కాని ప్లానింగు కమిషనువారుగాని చెప్పడం ఏమాత్రము సరికాదనే విషయాన్ని మంత్రిగారి దృష్టికితెస్తున్నాను. అందుచేత ప్రజలమీద ఎక్కువ పన్నుభారాన్ని మోపితే, వాళ్లు మోయలేరని అంటున్నాను.

ఇక Education విషయములో అభివృద్ధి లేదా అని అంటే, తప్పకుండా ఉన్నది. అయిదు సంవత్సరాలకుగాను 120 కోట్లు మొత్తముమీద ఖర్చుచేసినప్పటి కినీ, ఒక్కొక్క సంవత్సరానికి 20, 25 కోట్లవరకు మనము ఎంతవరకు ఖర్చుపెట్టటానికి వీలు అవుతుందో, అంతకంటే ఎక్కువఖర్చుచేస్తే, అభివృద్ధి తప్పకుండా అవుతుంది. అయితే సభ్యులు చాలామంది, ఎంత త్వర గాను, ఏవిధముగాను చేయాలని తెలుసుకోవాలని కోరుతున్నారు. దానికి అనేక రకాలసూచనలు చెశారు. మనము యీనాడు బడ్జటును ప్రవేశపెట్టు కున్నాము. వచ్చే బడ్జటు సమావేశమునకు మనము యిదేమాదిరిగా ఉంటే, ప్రభుత్వము ప్రవేశపెట్టబోయే Appropriation Bill ను ప్యాసు చేయమనికూడ ప్రభుత్వానికి తెలుసు. విశాలాంధ్ర అనండి, దానికి యింకా ఏపేరు అయినా పెట్టండి, అక్కడ శాసన సభలోనే యీ Bill ను ప్రవేశపెట్టడము జరుగుతుంది కాబట్టి మనము అక్కడికిపోయే ముందు, యిక్కడ మనకు కావలసిన కార్యక్రమాలు అన్నీగూడ పూర్తిచేసుకొని అక్కడికి వెళ్ళాలని అంటున్నాను. ముఖ్యంగా Land Reforms ను త్వరలో ప్రవేశపెట్టవలసిందిగా ఆందోళనచేస్తున్నాము. ప్రజలుకూడ ఆ సంస్కరణలు ఎప్పుడు వస్తాయా అని ఆతురతతో ఉంటున్నారు. ఈ విషయాన్ని మంత్రివర్గపుదృష్టికి తెస్తున్నాను. మనము విశాలాంధ్రకు పోయేముందే Land Reforms ను తీసుకుని రావాలని Planning Commission వారు సూచించారు. అవి తొందరలో తీసు కుని రావాలని మా కమ్యూనిస్టుపార్టీవారేకాదు, కాంగ్రెసుపార్టీలోఉన్న తీవ్ర వాదులే కోరుతున్నారు. Land Reforms ప్రవేశపెట్టినట్లయితే, ఏకొద్దిమందికో నష్టము కలిగితే కలగవచ్చు. కాని దానియొక్క ఫలితాన్ని ఎంతోమంది పొంద గలుగుతారు. ఇంతమందికి లాభించేటప్పుడు ఆ కలిగేనష్టము ఆ కొద్దిమంది వ్యక్తులు భరించకతప్పదు. అందువల్ల భూసంస్కరణల బిల్లును త్వరలో ప్రవేశపెట్టవల సిందిగా మంత్రివర్గాన్ని కోరుతున్నాను. మనకు కేంద్రప్రభుత్వం సహాయము చేయడములేదా అని చూచినప్పుడు, కేంద్రప్రభుత్వము మనకు సహాయము చేసేదాని కంటే, మనరాష్ట్రమునల్ల, కేంద్రప్రభుత్వమే ఎక్కువ లాభము పొందుతున్నదని నా అభిప్రాయము. అది ఏ విధముగా పొందుతున్నదంటే, మన రాష్ట్రమునుంచి

కేంద్రప్రభుత్వమువారు వసూలు చేసుకునే Tobacco excise duty ఎంతపో తున్నదో చూడండి. ఈ excise duty యే కాకుండా, యింకా యితర పన్నులు, Ports ద్వారానూ, Income-tax ద్వారానూ అన్నివిధముల Taxes చేర్చి కేంద్ర ప్రభుత్వము మన రాష్ట్రమునకు సంబంధించినంతవరకూ లెక్కచూస్తే, దాదాపు 25 కోట్లవరకూ వసూలు చేసుకుంటున్నది. ఇందులో మన ప్రభుత్వానికి యిచ్చేది చాలా తక్కువేనని స్పష్టముగా బోధపడుతున్నది. ఏ విధము గాను చాలినంత ఆదాయము లేనటువంటి యీ రాష్ట్రమునుంచి మనకు ఏకొద్దోయిచ్చి యింతసొమ్మును వసూలుచేసుకొని పోవడము పొరబాటు అని అంటున్నాను. ఈ ప్రభుత్వముకొరకు కేంద్రప్రభుత్వం ఎంతఖర్చు చెస్తున్నా రంటే, చాలా తక్కువే. ఇప్పుడు కేంద్రప్రభుత్వము వారుయిచ్చే సొమ్ము చాలదని మనము ఆందోళనచేయవలసిఉన్నది. పన్నులమీద పన్నులువేసి ప్రజలను పీడించే బదులు, మనము కేంద్రప్రభుత్వాన్ని, యింకా ఎక్కువ యివ్వమని ఎందుకుకోర గూడదు అని అంటున్నాను. మన రాష్ట్రమునుంచి వసూలు చేసుకునిపోయే సొమ్ములోనిదే యివ్వమని మనము కోరవచ్చు. అందులో తప్పుయేమీలేదు. పూర్వము మనము ఉమ్మడి మద్రాసు రాష్ట్రములో ఉన్నప్పుడు మద్రాసు శాసనసభలో యీ విషయము ఎన్నోసార్లు చర్చించాము. Finance Commission వారికి సూచనలు చేశాము. ఈ రాష్ట్రానికి ఎక్కువ ఆదాయము వచ్చేటట్లుగా చేయాలని అనేక మంది సభ్యులుగూడ మాట్లాడారు, కాంగ్రెసుపార్టీలోని వారే ఎక్కువ తీవ్రంగా మాట్లాడారు. కేంద్రప్రభుత్వము మనమాట వినదు అని ముఖ్యమంత్రిగారు ఆలో చిస్తూ కూర్చుంటే లాభములేదు. కాబట్టి శాసనసభ్యులము, మంత్రులు, అందరమూ చేరి ఒక్కుమ్మడిగా కేంద్రప్రభుత్వముమీద ఒత్తిడి తీసుకుని రావాలని అంటు న్నాను. కేంద్రప్రభుత్వంలోని సభ్యులు వారికి అనుకూలముగానే మాట్లాడుతారు. అందులో ఎక్కువమంది పారిశ్రామికంగా అభివృద్ధిచెందినవారు, వ్యాపారస్థులు ఉన్నారు. వారియొక్క పలుకుబడే కేంద్రప్రభుత్వములో ఎక్కువగా ఉంటున్నది. వారందరు కేంద్రప్రభుత్వమును అంటిపెట్టుకుని కూర్చున్నవారే. మన బడ్జటు చూస్తే, మనయొక్క ఆదాయము ఎంతఉంటున్నదో వారికి తెలియకపోలేదు. ఈ విధముగా కేంద్రప్రభుత్వము అన్యాయముచేసేది మన ఒక్కరాష్ట్రముకే కాదు. ఈ విధముగా అభివృద్ధి కానటువంటి యితర రాష్ట్రాలకన్నింటికీగూడ అన్యాయాలు జరుగుతూనే ఉన్నవి. కాబట్టి మన రాష్ట్రమునకు యింకా ఎక్కువసొమ్ము యివ్వమని మనము కేంద్రప్రభుత్వాన్ని ఒత్తిడిచేయవలసి ఉన్నదని అంటున్నాను.

తరువాత, నాగార్జున సాగర్ ప్రాజెక్టు విషయమును తీసుకుంటాను. ఈ ప్రాజెక్టుక్రింద మనము ఏ నూటముప్పై కోట్ల రూపాయలలో ఖర్చుచేయబోతున్నాము. ఈ ఖర్చు అంతా మన ఒక్క రాష్ట్రమే భరించాలని అంటే, మనము చేయగలిగినది

ఏమీలేదు. ఇంత పెద్ద ప్రాజెక్టును మేము కట్టించలేమని సంజీవ రెడ్డిగారు ఏ సత్యాగ్రహమో చేస్తేనో లేకపోతే, ఏ strike చేస్తేనో తప్ప లాభములేదు. నాగార్జున సాగర్ ప్రాజెక్టు లేకుండా, తుంగభద్ర హైలెవెల్ కెనాల్ మనము ప్రారంభిస్తే, మనకు ఉన్న revenue అంతాగూడ దానికే సరిపోతుంది, దానికి మాత్రమే మేము ఖర్చు పెట్టుకోగలము, మిగిలినవి అన్నీ, యీ నాగార్జున సాగర్ ప్రాజెక్టు వగైరాలు, మేము కట్టించలేము, మావల్ల కానేకాదు అని సంజీవరెడ్డిగారు దస్తరము క్రింద పడవేసి కూర్చుంటేగూడ, అందులో ఆశ్చర్యము యేమీ లేదు. ఇందులో మనకు మిగిలే డబ్బు ఏమీ ఉండదు. అందువల్ల నాగార్జున సాగర్ లాంటి పెద్ద పెద్ద ప్రాజెక్టులు ఎప్పుడూకూడా కేంద్ర ప్రభుత్వమే కట్టిస్తే బాగా ఉంటుందని మాత్రము సూచిస్తున్నాను. కేంద్ర ప్రభుత్వము బక్రానంగల్, దామోదర వ్యాలీ ప్రాజెక్టులూ, మద్రాసువారికి నైవిల్లీ ప్రాజెక్టు కట్టించడము లేదా! అదే మాదిరి మనకు నాగార్జున సాగర్ ప్రాజెక్టు ఎందుకు కట్టించియివ్వకూడదు? ఆంధ్ర దేశములో కనీసము యీ నాగార్జున సాగర్ ప్రాజెక్టు అయినా కేంద్ర ప్రభుత్వము అజ్మాయిషీ క్రింద కట్టించమని ప్రభుత్వము కోరవలెనని అంటున్నాను. కావాలంటే, దానికి అయ్యే ఖర్చు అంతా యీ ప్రభుత్వము నెత్తిమీద వెయ్యమనండి. ఆ అప్పు అంతా మనము నెమ్మదిగా తీర్చుకుందాము. ఆ బాధ్యత అంతా ఆంధ్ర ప్రభుత్వముమీద విశాలాంధ్ర ప్రభుత్వముమీద కేంద్ర ప్రభుత్వము పెట్టడము సబబుగాలేదు. కాబట్టి యీ ప్రాజెక్టును కట్టించి యిచ్చే బాధ్యత కేంద్ర ప్రభుత్వమే భరించాలని ప్రభుత్వము వత్తిడి చేయాలని అంటున్నాను. దీనికోసము మనమందరము కలిసి ఆందోళన చేయాలి. ఇంత పెద్ద ప్రాజెక్టు, 130 కోట్లో అంతకు పైగానో ఖర్చు పెట్టవలసిన ప్రాజెక్టు మన State కట్టించగలదా అని నేను ప్రశ్నిస్తున్నాను. మనము ఎన్ని పన్నులు వేసుకున్నా ఏమి, ఎన్ని అప్పులుచేసినా ఏమి, మన State Revenues ను ఎంత అభివృద్ధి చేసుకుంటే ఏమి, యింత పెద్ద విలువగల ప్రాజెక్టు మనమే కట్టించుకునేటట్లయితే, సంవత్సరము ఒకటింటికి ఒక కోటో, రెండు కోట్లో కేటాయించుకుని ప్రాజెక్టు కట్టటమునకు ఆరంభిస్తే, ఇక అది పూర్తి కావటానికి ఎన్ని సంవత్సరాలు పట్టుతుందో, ఆలోచించమని అంటున్నాను. కాబట్టి యింత పెద్ద ప్రాజెక్టు మన State కట్టించలేదు. గనుక దీనియొక్క బరువు అంతా కేంద్ర ప్రభుత్వము మీదనే వేయండి అని అంటున్నాను. అది కేంద్ర ప్రభుత్వము కట్టిస్తే తుంగభద్ర హైలెవెల్ కెనాల్, వంశధార మనకు ముఖ్యమైనవి, కాబట్టి, అవి మనము కట్టించుకోవచ్చును. అందువల్ల బాక్రానంగల్, దామోదర వ్యాలీ, మద్రాసులో నెవిలీ పాజెక్టు, యివి అన్నీ కేంద్ర ప్రభుత్వము ఏ విధముగా బాధ్యత అంతా నెత్తిమీద వేసుకుని చేస్తున్నదో, అదే విధముగా మన నాగార్జున సాగర్ ప్రాజెక్టునుగూడ Central Government వారినే కట్టించమని కోరవలసిందిగా మంత్రిగారిని కోరు

తున్నాను. మనకు Planning Commission వారు యిచ్చిన allotments మన బడ్జెటులో చూస్తే చాలా తక్కువగా ఉన్నదనే సంగతి మరచకూడదని మా భ్రమ హెచ్చరిస్తున్నాను. ఇతర రాష్ట్రములతో మన రాష్ట్రమును పోల్చి చూచుకుంటే, మన రాష్ట్రానికి యిచ్చిన allotment చాలా తక్కువగా ఉన్నది. పోనీ, Population basis మీద చూచుకున్నప్పటికినీ, యింకా area basis తో చూచుకున్నప్పటికినీ, అదీ కాకపోయినా, revenue resources ను basis గా తీసుకున్నాగూడ, చివరికి ఏ basis మీద చూచినాగూడ మనకు చాలా తక్కువగా allot చేశారు. ఈ విషయము ప్రభుత్వము గుర్తించిందని అనుకుంటాను కళా వెంకట్రావుగారు యిప్పుడు యిక్కడసభలో లేరు. వారుకూడ ఏమి చెప్పారంటే, మేము చేయదగిన ప్రయత్నము అంతా చేశాము కాని, మనకు న్యాయముగా రావలసింది యిచ్చారని చెప్పారు. Planning Commission వారు మనకు ఇచ్చినది న్యాయముగానే యిచ్చారని ఆత్మ సంతృప్తిపొందమని చెప్పటానికి ప్రయత్నించారు. వారు ఆవిధముగా చెప్పడము చాలా పొరబాటు. చేయవలసిన ప్రయత్నము చేయ లేదనే మా నమ్మకము. వారు ప్రయత్నముచేయడములో లోపముచేసి ఉండవచ్చు మంత్రులందరూకూడ పోయి యింకా యెక్కువగా యివ్వమని కోరిఉండవలసింది. కేంద్రప్రభుత్వము చెప్పినట్లుగా ఎక్కడైతే పెద్దపెద్ద పరిశ్రమలు ఉన్నవో, అవి ఎక్కడెక్కడైతే వారిచెప్పు చేతులలో ఉన్నవో, అక్కడ ఎక్కువగాయిచ్చి, వెనుక బడిన ప్రాంతాలు ముందుగా అభివృద్ధిపరచవలసివుంటుందనే దృష్టి planning వారు పెట్టుకోకుండా, allot చేశారని చెప్పక తప్పదు. పరిశ్రమలను ఏర్పాటుచేసే సందర్భములో మనమందరమూకూడా చెప్పాము. మనరాష్ట్రములో ఒక్క fertiliser factory అయినా పెట్టండి అని కోరియున్నాము. మీకు యిదిలేదు, అది లేదు, అని చెబుతున్నారు. అన్నికూడ ఒకచోటులోనే ఉండవు అవిధముగా ఒకేచోటులో ఉంటేగూడ నష్టముగూడ వస్తూనే ఉంటుంది. మన ప్రాజెక్టు సౌకర్యాలు దృష్టిలో పెట్టుకుని యీ factory మన రాష్ట్రములో పెట్టితే, కట్టటానికి డబ్బుకూడ తక్కువ అవుతుంది. ప్రాజెక్టులు ఉండడమువల్ల, ఎక్కువ ఆదాయము కూడ వచ్చే అవకాశాలు ఉన్నవి. అక్కడ ఎక్కడో కట్టితే ఎక్కువ అవుతుందని యిక్కడ కట్టితే తక్కువ అవుతుందని చెప్పడములేదు. మనకు యిక్కడ లేబరు ఎక్కువగా పనులులేకుండా అవస్థలుపడుతున్న సంగతి అందరికి తెలుసు. మనకు ఉన్న లేబరే డబ్బుక్రింద లెక్క చూచుకోవచ్చు. లేబరు చేసి కష్టము అంతా డబ్బురూపములో మారుతూ ఉంటుంది. మనకు ఉన్న లేబరునుబట్టి పనులు తొందరలోనూ చౌకగానూ పూర్తికాగలవు. ఊరకనే రూపాయనోట్లు గుద్దితే మనకు అంతా డబ్బే. కాబట్టి మనము ఎంతడబ్బైనా తయారుచేసుకోవచ్చు.

[illegible]

అందువల్ల Planning Commission వారు యీ విషయములో మనకు చాలా అన్యాయము చేశారని అంటున్నాను. ఇంకొకవిషయము చెప్పి నేను ముగిస్తాను.

మనకు deficit financing అని ముఖ్యమంత్రిగారు చాలా బెదిరిపోతూ ఉన్నారు Deficit budget అంటే deficit financing అన్నమాటే. It will lead to deficit financing. అందువల్ల deficit budget అని మనము భయపడనక్కరలేదు. ధైర్యముగా ఖర్చుపెట్టమనండి. మనకు ఉండే resources ఏమిటి? అవి మనము ఏవిధముగా సాధించగలము ? అనేకవిషయాలు మనము చూచుకుంటే మనకు యిక్కడ లేబరు ఎక్కువగా ఉన్నది. మన రాష్ట్రములో రెండుకోట్లమంది ఉన్నారు. ఇందులో ప్రభుత్వానికి కావలసినంత మటుకు తీసుకొని పనులు కల్పించవచ్చును. వారికి ఊరకనే తిండిపెట్టి, మంచినీళ్లు యిస్తామని చెబితేచాలు. ఎంతోమంది ముందుకువచ్చి పనిచేయటానికి సిద్ధముగా ఉన్నారు School building విషయములోకూడా మనకు పెద్దపెద్ద costly buildings అవసరములేదు. అంతంత పెద్ద పెద్దభవనాలు కట్టించాలని అంటే, మన State భరించలేదుకూడా. పూర్వము మనము పూరిపాకలలో కూర్చొని చదువుకోలేదా ! ఇప్పుడుమాత్రము ఎందుకు చదువకూడదు ? ఏవో ముఖ్యంగా స్కూలుకు అవసరమైనవి laboratory room, record room, వగైరాలు ఏవో కొద్దిగా కట్టుకుని, తక్కినది పూరిపాకలలోనే జరుపుకోవచ్చు. అందువల్ల మనకు ఉన్న కొద్దిడబ్బును, యీ పెద్దభవనాలకు ఖర్చుచేయకుండా కొద్దిమాత్రము buildings కట్టుకుంటే చాలు అని అంటున్నాను. పెద్ద building లేవని మనము విచారపడనక్కరలేదు. ఏవో minimum necessities కోసము ఏర్పాటు చేసుకుంటే చాలునని అంటున్నాను. High Schools కు మనకు పెద్దపెద్ద buildings ఉన్నవా లేవా అని చూడడములో ప్రయోజనములేదు. కాబట్టి schools కొరకు ఎక్కువగా సొమ్ము ఖర్చుచేయడము మంచిదికాదని అంటున్నాను. ఈ విధముగా ferro concrete buildings, Air-conditioned rooms మనకు లేవని విచారపడవలసిన పనిలేదు. సామాన్యపు buildings ఉంటే చాలు. Minimum necessities తో స్కూళ్లు ఏర్పాటుచేస్తే, పిల్లలకు చదువురాకుండా పోతుందా అని అడుగుతున్నాను. కాబట్టి School buildings కొరకు ఎక్కువగా ఖర్చుచేయవద్దని మంత్రిగారికి విజ్ఞప్తిచేస్తున్నాను.

మనం cement ను Irrigation projects కీ, power projects కీ మాత్రమే ఎక్కువ ఖర్చుపెట్టాలిగాని road లకు cement ఖర్చుపెట్టడం తగ్గించు కోవాలి. మనం cement roads వేసుకోలే నిస్థితిలో ఉన్నాం. ఈ రోజున ప్రస్తుతం Cement రోడ్లకు స్వస్తి చెప్పవలసిన అవసరంఉన్నదని మంత్రిగారి దృష్టికి

తీసుకువస్తున్నాను. ఈనాడు ఈ Appropriation bill మీద నేను అనేక సూచనలు చేశాం. ముఖ్యంగా Service విషయంలో లోగడ జీతాలు ఎక్కువ చేయమంటే వెంటనే ఎక్కువ చేయలేమని చెబుతున్నారు. విశాలాంధ్ర రాబోతున్నది. అక్కడి జీతాలు, ఇక్కడిజీతాలు ఒకేరకంగా ఉండవలసిన అవసరం ఉంటుంది. ఎక్కడైనాసరే జీతాలుమాత్రం తగ్గించవద్దని నేను విజ్ఞప్తి చేస్తున్నాను. అంతటజీతాలూ ఒకేస్థితిలోకి తీసుకురావాలి. అవసరమైతే ఇక్కడ ఉన్నవారి జీతాలు పెంచవలసియుంటే తప్పకుండా పెంచడానికి మనం తయారుగా ఉండాలని, ఏ పరిస్థితిలోనూ అక్కడ జీతాలుతగ్గించవద్దని విజ్ఞప్తిచేస్తున్నాను. ఇంకా ఈ ఉద్యోగస్థుల Promotion లోనూ వాటిలోనూ చాలా అన్యాయాలు జరుగుతూఉన్నాయని మంత్రివర్గ దృష్టికి తీసుకువస్తున్నాను. ఎవరో ఏదో చెబుతున్నారంటేకాదు. Public Service Commission పరీక్షకు వచ్చినప్పుడు వచ్చినవారు తిరిగిపోతూఉంటే "ఎందుకు వచ్చామురా, డబ్బంతా వృథా ఐపోయిందని" ముందుగా నే తెలుసుకుని చాలా బాధతో వెళ్ళిపోవడం జరుగుతోంది.

THE HON. DR. B. GOPALA REDDI :—పరీక్ష తప్పిన వాళ్లు.

SRI PILLALAMARRI VENKATESWARLU :—క్షవరం కాబోతున్నదని వాపోతున్నారు. ఒక ఉదంతం చెబుతున్నాను. మంత్రిగారిని ఓపికగా సహృదయంతో ఆలోచించమని, ఎవరిమీదో నిందలుమోపడానికి మాత్రమే చెప్పడం లేదని, జరుగుతూయున్న అన్యాయాన్ని దృష్టికి తీసుకురావడానికి చెబుతున్నాను ఈ రోజున Backward Classes కి అని రెండు Deputy Collectors Post లు reserve చేసియున్నారు. ఒక post కు selection కు 80 మందిని Invite చేశారు. పరీక్షకు కూర్చున్నారు. 80 మందిని మళ్ళీరమ్మన్నారు. వారిని పంపించేసి, 80 మందినుంచి 30 మందికిదింపి ఈ 30 మందిలోకూడా అర్హులు ఎవ్వరూలేరని ఎక్కడనుంచో ఒకరిని—అయనపేరుచెబితే బాగుండదు కనుక నేను చెప్పడంలేదు—personal గా ముఖ్యమంత్రిగారు కావాలంటే చెప్పడానికి నేను సిద్ధంగా నేడున్నాను. వారిని select చేశారు. ఇల్లాంటి అన్యాయాలు జరుగుతున్నాయి. Backward Classes వారికిగాని, హరిజనులకుగాని అసంతృప్తి ఎక్కువవుతోందంటే వీటివల్లనే. Reservation చేశాం, న్యాయమో, అన్యాయమో దానిప్రకారం ఉన్నటువంటి వాళ్ళలో select చెయ్యాలిగాని ఆ 30 మందిలో దొరకకపోతే ఇంక మీకు హరిజనులలోగాని, Backward communities లోగాని లేరనిచెప్పండి. ఈ reservation, ఈ నాటకం ఈ భాగోతం అంతా దేనికని నేనడుగుతున్నాను. Public Service Commission లో

కూడా ఇల్లాంటి అన్యాయాలు జరుగుతున్నాయి. మనం దీనిని జాగ్రత్తగా పరిశీలించవలసిన అవసరం ఉన్నది. మన State లో అన్ని తరగతుల ప్రజానీకానికి మనం బాధ్యత వహిస్తున్నాం. వారికి వచ్చినటువంటి ఇబ్బందులు మన దృష్టికి వచ్చినప్పుడు సహృదయంతో ఆలోచించాలని, ఎవరిమీదో నిందలు మోపడానికో దేనికో చెప్పారని అనుకోకూడదు. నా కెవ్వరి తరఫున మాట్లాడానికి ఎవరూ లేరని మాత్రం నేను చెబుతున్నాను. నాకే కాదు. ఏ Member చెప్పినప్పటికీకూడా తనకెవరో చుట్టమో, బంధువో, ఉన్నారని కాదు. ఒకవేళ ఉండేటట్లయితే మీరు దాన్ని expose చెయ్యండి. ఫలానావాడు తనమిత్రుడికోసం, లేక తనయొక్క చుట్టంకోసం తీసుకువచ్చి చెప్పాడని prove చెయ్యండి దానికి అర్థం ఉంటుంది. అల్లాకాకుండా general గా ఏదైనా తీసుకువచ్చి చెబితే దాన్ని ఆలోచించకుండా ఉండడం న్యాయంగాదు. Promotion లలో అన్యాయాలు జరుగుతున్నాయని మాదృష్టికి వచ్చినట్లే మంత్రుల దృష్టికికూడా వస్తూనే ఉంటాయి. మాకు వస్తూయున్న ఉత్తరాల కాపీలు మంత్రులకుకూడా వస్తూనే ఉంటాయి. వాటిని తప్పకుండా పరిశీలనచేసి న్యాయం ఉందాలేదా అని ఆలోచించండి. దానికైన మేము సంతోషిస్తాం. ఈనాడు గోపాలరెడ్డిగారో, సంజీవరెడ్డిగారో న్యాయం ఉన్నదాలేదా అని విచారణ చేయడానికి పూనుకుంటే న్యాయం గుర్తించలేకుండా పోతారనేటటువంటి నిరాశ మాకింతవరకూ ఏర్పడలేదు. ఇకమీద ఏర్పడేటట్లు చేస్తారేమో వారిమీదనే ఆధారపడి ఉంటుంది. ఈ అన్యాయాలు ఎక్కువగా సాగనీయకుండా చూడవలసిన అవసరం ఉంది. ఒక విషయం చెప్పదలచుకున్నాను. ఈ విషయం ఇదివరకుకూడా చెప్పాను. పోలీసు బందోబస్తు చేసేటప్పుడు అధ్యక్షులవారి సమక్షంలోకూడా మొన్నమొన్ననే ఒక విషయం జరిగింది. ఇక్కడ Kurnool లోనే జరిగింది. ఆనాడు మేము రైలులో దిగాం. Select Committee Meeting ఉన్నది. రైలు 9½ కు వచ్చింది. 9½ కే Select Committee Meeting fix చేశారు. చంద్రమౌళిగారూ, మేమూ అంతా హడావుడిగా రావాలని వస్తున్నాం. Police వారు నా రిక్షా పోకూడదని ఆపుచేశారు ఎందువల్ల అని అడిగినాం. ఎందువల్ల ఏమిటి I. G. గారో ఎవరో వస్తున్నారు అన్నారు. I. G. గారి kith & kin ఎవరో అనుకోండి వచ్చారు. ఆయనకోసం రిక్షాలన్నీ ఆపేశారే? నువ్వు ఎందుకు పోనివ్వవు? ఏంచేస్తావో చేసుకో తరువాత నీకు ఏమి చట్టం ఉన్నదో చూస్తాం అని చెప్పాను. Speaker గారు అక్కడుండడంవల్ల రిక్షాలన్నీ పోనిచ్చారు. లేకపోతే ఏమయ్యేదో నేను ఊహించలేను. ఆవిధంగా బెజవాడలోకూడా అనేక తడవులు జరిగింది. గవర్నరుగారు కాని, ముఖ్యమంత్రిగారు కాని, ఎవరు వచ్చినా తప్పకుండా గౌరవిస్తాం. మీరు ప్రజలందరి తరఫునా మంత్రులుగా ఉన్నప్పుడు గౌరవవించవలసిన బాధ్యత

మామీద ఉన్నది. గోపాలరెడ్డిగారిని వ్యక్తిగతంగా గౌరవించవచ్చు. దేశం తరఫున ముఖ్యమంత్రిగా ఉన్నందుకుకూడా తప్పకుండా గౌరవిస్తాం. అంతమాత్రం చేత ఆయన వచ్చినప్పుడు ఏ బండీ పోకూడదని, ఈ రోడ్డుమీద నుంచి ఎవరూ నడవ కూడదని అనే బదులు వచ్చేముందు security కోసం [illegible] కనిపించినప్పుడు కొంచెం తప్పుకోండని అంటే ప్రక్కగానుంచోవచ్చు. అంతేగాని ఏనిగా బస్సు పోకుండా నడవడానికికూడా వీలులేదని అనేక ఫిర్యాదులు చేస్తున్నారు. ఒక [illegible] రైలు తప్పిపోవడంకూడా జరిగింది. ఎందుకంటే ఎప్పుడో గవర్నరుగారు వస్తారని traffic ఆపేశారు సరియైన టైముకు ఏ సినిమాలో 10 నిముషాలలో ముందు బయలు దేరి పోవలసిన చోటికి పోవచ్చును. మూడు గంటలు ముందునుంచీ బందోబస్తు పెట్టి, ప్రజలను రోడ్డుమీద నడవనివ్వకుండా బాధపెట్టడం ఏమి న్యాయం? పోలీసులలో మార్పులేదా అంటే, ఉంది. ఇంకా ఎక్కువ మార్పు తీసుకురావలసిన అవసరం ఉంది. పరిపాలనలో వచ్చే ఇబ్బందులు తీసుకువచ్చి మంత్రి వర్యులకు నివేదిస్తూ ఉంటాం. వారనికూడా సహృదయంతో చూడమని కోరుతూ ఉంటాం. అంతే గాని ఎవరిమీదో కోపంచేత, లేక factions కోసమో, లేక పరిపాలనలో జోక్యం కల్గించుకుని అదంతా పాడుచెయ్యాలని ఉద్దేశ్యంతోనో చెప్పడంలేదు. జరిగే అన్యాయాలు మాకు తెలుస్తూ ఉంటాయి. మేము చేయవల్గింది మీతో చెప్పుకోవడమే. లేకపోతే officer లు ఎవరైనా వింటారని ధైర్యం ఉంటే Collector గారికో, ఎవరికో ఉత్తరం వ్రాయడం, అంతకన్న మేము చేయవల్గింది ఏమీ ఉండదు మన State ప్రతిష్ట ఎక్కువ కావాలని మీతోపాటే మేముకూడా పూర్తిగా ఆశిస్తున్నాం. ఇవన్నీ జరగాలి అన్నట్లయితే మన ప్రజలలో విశ్వాసం ఉండి తీరాలి. ఉద్యోగస్థులు కూడా ప్రజలకు సేవకులుగా తయారయ్యేటట్లు మనం చూడాలి. ఆనాడే ప్రజలందరి విశ్వాసం వారు చూరగొంటారు. ప్రభుత్వం పటిష్టంగా నడవడానికి వీలుంటుంది. ప్రభుత్వ విషయాలలో ఎక్కువగా జోక్యం కల్గించుకునే ఉద్దేశ్యం మాకు లేదు కాని అన్యాయాలు జరగకుండా చూడవలసిన బాధ్యత మీ మీద ఉన్నది.

SRIMATHI C. AMMANNA RAJA:—అధ్యక్షా, ఇన్నిరోజులు చర్చ జరిగిన తరువాత ఈవిషయమై ఇంకా పెద్ద చర్చ అవసరంలేదు, అని గోపాలరెడ్డిగారు చెప్పారు. నిజమే. కాని నేను budget general discussion లో మాట్లాడలేదు నేను చెప్పబోయేది ఎవరైనా చెప్పిఉన్నట్లయితే నేను మాట్లాడనక్కర్లేదనుకున్నాను. . గోపాలరెడ్డిగారు మాటిమాటికీ హోమియోపతి bill అంటూ ఉంటారు ఈ appropriation bill రెండు clauses తో ప్రవేశపెట్టారు. అది మామూలు, కాని discussion మాత్రం సాధారణంగా ఇన్నాళ్లు జరిగినా,

29th March 1956] [Srimathi C. Ammanna Raja

చర్చ అంతటికీ సంబంధించియుంటుంది. మంత్రులు చాలా శ్రద్ధగా వారివారి department లను కాపాడుకోడానికి ఉత్సాహపడుతూయున్న సంగతి నిజమే. కాని కొన్ని ప్రాంతాలుమాత్రం పొందవలసినలాభం పొందడంలేదేమోనని నేను సంశయిస్తున్నాను. కొన్ని departments, కొన్ని ప్రాంతాలుకూడా కొంత నష్టపడుతూయున్నవి. ఎందువల్లనంటే వాటివిషయంలో శ్రద్ధలేకపోబట్టి. నేను ముఖ్యమంత్రిగారికి చెప్పేవిషయం ఏమిటంటే ఏ department ఐనా బాగున్నదంటే ఆ credit ఆ department కు పోతుంది. ఏదైనా మొత్తంమీద బాగాలేదంటే ఆ అపకీర్తి వారికి వస్తుంది. కాబట్టి అన్ని విషయాలుకూడా జాగ్రతగా, ఏదో బలవంతం చేశారు, pressure తీసుకువచ్చారని కాకుండా ఏవిషయంలో ఎంతశ్రద్ధ తీసుకోవాలో అది తనబాధ్యతగా చాలాజాగ్రతగా ఆలోచించి చెయ్యాలనిమాత్రం వారికి సలహా చెపుతున్నాను. Medical department లో కొంతవరకూ చాలా శ్రద్ధతీసుకుంటున్నారు మంత్రి కళా వెంకట్రావుగారు. కాని నా అభిప్రాయం ప్రకారం medical department కంటే health department విషయమై ఎక్కువశ్రద్ధ తీసుకోవాలి. ఎందుకంటే రాజేంద్రప్రసాద్‌గారు విశాఖపట్టణంలో చెప్పారు. "you must extinguish yourself on the medical department". అని మనం health side పై ఎక్కువశ్రద్ధ తీసుకున్నప్పుడు medical side ని అంతఖర్చు అవసరం ఉండదు. జబ్బులు రాకుండాచేసినట్లయితే medical department అవసరమే ఉండదు. కాబట్టి preventive side లో ఎక్కువశ్రద్ధ తీసుకోవాలి. ఎంతెంతో ఖర్చుచేస్తున్నాం. గ్రామాలకు irrigation కు సంబంధించినంతవరకూ తప్ప, మనం ఏమిచేయగలుగుతున్నామో నాకు తెలియడంలేదు.

పల్లెల రోడ్లు ప్రయాణంచేయడానికి విపరీతమయిన కష్టంగా ఉన్నాయి. ఇటువంటిగ్రామాలకు మంత్రులు రానేరాము. త్రాగడానికి మంచినీళ్లు ఉండవు. కొంతమంది ఆఫీసర్లకుమాత్రం ఎవరో మోసుకునివస్తారు. ఒకరోజుకూడా వీరు ఆ ఊరిలో ఉండలేరు. ఆ గ్రామంలో ప్రజలు ఏవిధంగా రోజూ ఉంటారో తెలియదు. వేసవికాలంలో ఒక చెరువో నుయ్యో వుంటే అంతదూరం ఆడవారు వెళ్ళి మంచినీళ్లు తెచ్చుకోవలసిందే. రోడ్లు పెద్దగుంటలు. చంద్రమౌళిగారు వచ్చి మా constituency చూశారు. జగజీవనరాంగారు ఒకసారి నాతో అన్నారు— "Communication ఎంతో విపరీతంగా పెంచాము; అంటే 24 గంటలలో ఒక ప్రదేశంనుంచి ఏ ప్రదేశానికైనా వెళ్లవచ్చును. కాని ఇక్కడ ఒక గ్రామంనుంచి మరొకగ్రామం వెళ్లడానికే ఎంతో శ్రమపడవలసి ఉంటున్నది" అని 3,4 మైళ్లు వెళ్లాలన్నా 4 గంటలు పడుతుంది. బండి వెళ్లడానికి వీలులేనిస్థితిలోవున్నాయి. పెద్దరోడ్ల విషయంలోమాత్రమేకొంత శ్రద్ధతీసుకుంటున్నారు. జిల్లాబోర్డులు సరిగా పనిచేయడం

Srimathi C. Ammanna Raja] [29th March 1956

లేదని Special Officers చేతులలో పెట్టారు. Funds లేవు కాబట్టి maintenance లేదు ఇంక పంచాయితీ బోర్డులను ఇవ్వగాబడి స్వల్పం; చేయుగలిగిన పనులు కొంచెము. అందులో కూడ జాగ్రత్త తీసుకొని దానికి వీలు లేకుండా ఉంది. ప్రతి పంచాయితీ బోర్డులోను రెండు పార్టీలుంటాయి. ఈ రోడ్ల విషయమై ఏ విధంగా శ్రద్ధతీసుకుంటారో కొంచెం ఆలోచించవలసి యున్నది అత్తిలినుంచి గల్లిపాడు మీదుగా మైళ్లు. ఈ దూరం వెళ్లాలంటే నడచిఅయినా వెళ్లవచ్చు. కాని బండిలో వెళ్లలేము. గర్భిణీస్త్రీ ఉంది అంటే ఆ రోడ్లమీద ఎలా వెళ్లగలదు? ఎక్కడకు వెళ్లగలదు? కర్నూలంటే ఒక డాక్టరు అవసరమయితే అర్ధరాత్రి అయినా phone చేస్తాము, పిలిపించుకుంటాము. లేకపోతే patient ను తీసుకువెడతాము, hospitals ఇక్కడ ఉన్నాయి కాబట్టి Immediate గా medical aid కావలసిన cases అటువంటి చోట్ల ఉంటే వారిగతి ఏమి కావాలి? కనీసం రోడ్లు అయినా ఉంటే బండిలో అయినా తీసుకు వెళ్లడానికి వీలుంటుంది. అక్కడ వారికి ఏ విధమయిన సహాయం చేయగలుగుతున్నాము? ఒక Mobile van ను అయినా ఇవ్వగలుగుతున్నామా? Telephone లేదు, Water supply లేదు. ఎటుచూసినా దోమలు, త్రాగడానికి నీళ్లులేవు. తినుబండారాలు బస్సులు ఆగే చోట open గా పెట్టి అమ్ముతుంటారు. దానినిండా దుమ్ము. భగవంతుడు ఏదో వారిని కాపాడుతున్నాడుతప్ప ఇంతకన్న ఎక్కువ వ్యాధులు ఎందులకు రావడంలేదా అనిపిస్తుంది. ఇటువంటి చోట్ల ఏ సహాయంచేయకుండా పెద్ద మొత్తాలు ఖర్చుచేయడం అనవసరం అనుకుంటున్నాను. ఇప్పుడు మశూచికంవల్ల ఎంతమంది చచ్చిపోతున్నారు? Statistics ను gather చేసినారో లేదో నాకు తెలియదు, కర్నూలు పట్టణంలోకూడా పెద్ద ఉద్యోగస్థుల బిడ్డలుకూడా మశూచికంపడడం, కొంతమంది చచ్చిపోవడం జరుగుతోంది. దానికి ఏదైనా శ్రద్ధతీసుకున్నారా? Compulsory Vaccination అవసరమని తెలుసా? Health Department వారు ఇంటింటికి వెళ్లి ఈ వైపు మశూచికాలున్నాయి, Vaccination చేసుకోవాలి అని చెప్పారా?

The Hon. Sri A. B. NAGESWARA RAO :—Compulsory vaccination force లో ఉంది.

SRIMATHI C. AMMANNA RAJA :—Force లో ఉన్న దేమో. కాని actual గా జరుగడంలేదు. మాలాంటివాళ్లం phone చేసినా శ్రద్ధతీసుకోవడం లేదని చెబుతున్నాను

29th March 1956]

THE HON. SRI A. B. NAGESWARA RAO :—Offices లో కూడా మా అమ్మాయిలకు అబ్బాయిలకు అక్కరలేదని చెప్పిన వాళ్లున్నారు.

SRIMATHI C. AMMANNA RAJA :—అది నాకు తెలుసు. అందుకే compulsion అవసరం. వాళ్లకు శ్రద్ధలేదు, అజ్ఞానంగా ఉంటున్నారంటే వారి ఆరోగ్య బాధ్యత మనదికాదా అని అడుగుతున్నాను. Cholera తో inoculation లేక ఎంతోమంది చచ్చి పోతున్నారు. Preventive side లో ఎక్కువ ఖర్చులేదు ; శ్రద్ధ మాత్రమే అవసరం. ఉన్న personnel చాలు. చేస్తున్న ఖర్చుతోనే తగిన శ్రద్ధ తీసుకుంటే వారి ప్రాణాలు కాపాడి ఎన్నో వ్యాధులు రాకుండా చేయగలము. ఎక్కడ చూసినా మురికి గుంటలు. Open గా sweets పెట్టి అమ్ముతుంటే Health Department వారు ఏమి చేస్తున్నట్లు ? బస్సులు ఆగునప్పటికి ఆ Sweet Meats మీద dust deposit అవుతుంది. అది ఎందుకు prohibit చేయరు. మీరు grants ఇచ్చేటప్పుడు ఈ విషయంలో శ్రద్ధ తీసుకోవాలి. ఏ విధంగా ఆరోగ్యం కాపాడుకోవాలో గట్టిగా చెప్పవలసి యున్నది గ్రామ అభివృద్ధికి పాటుబడ బోతున్నాము. పంచవర్ష ప్రణాళికలో ముఖ్యమైన అంశం ఇది. గ్రామాలు అభివృద్ధి కావాలంటే పంచాయితీలు సరిగా పనిచేయాలి. ఏ పంచాయితీలో చూచినా రెండు పార్టీలు. అనేక పార్టీలను కలుపుకుని ఐక్యత సాధించిన గోపాలరెడ్డిగారి వంటివారు గ్రామాలకు పోయినప్పుడు local గా మీకు ఉండే తగాదాలు ఏమిటి, కష్టాలు ఏమిటి అని విచారించి local parties ని దగ్గరకు చేర్చి బేదాభిప్రాయాలను మాన్పలేకపోతే పంచాయితీలు మాత్రం సరిగా పనిచేయవు. ఎంత ఖర్చు చేసినా సరిగ్గా గ్రామాల్లో పనిజరుగదు. ఒకరు హాస్పిటలు కావాలంటే మరొకరు రోడ్డు అంటారు. ఇద్దరిమధ్య ఏమీ జరుగకుండా పోతుంది. ఒక పంచాయితీ స్కూలు కావాలని అంటే పెద్ద ఖర్చుతో ఒక building కావాలి. ప్రతి చోట జరుగుచున్నదే. గ్రామ అభివృద్ధి జరగాలంటే, ఈ ప్రణాళిక మనది ; ఇంత ఖర్చు చేస్తున్నారు ; మనం ఉపయోగించుకోవాలి ; ఉపయోగించుకోకపోతే grants lapse అయిపోతాయి , వెనుకబడిన ప్రాంతాలు ఇంకా వెనుకబడి పోతాయని తెలుసుకుని కలిసి పని చేయాలి. M.L.As. ఏమి చేస్తున్నారని మీరు అడగవచ్చు. వారు కూడా ఏదో ఒక పార్టీకి చెందినవారే అవుతారు ; అందుచేత మిగిలిన వారిని కూడ గట్టుకోనలేక పోతున్నారు. ఎవరిమాటలు వింటారో వారు ఎక్కువ శ్రద్ధ తీసుకుంటే పెద్ద ఖర్చు లేకుండా పని జరుగుతుంది. Womens Department సంగతి రుక్మిణమ్మగారు ఒక్క sentence మాత్రం చెప్పారు, ఎంత వెదకినా ఒక్క మాటలేదు అని. దీనిని గురించి రెండవ పంచవర్ష ప్రణాళికలో కళా

వెంకట్రావుగారు ఇచ్చినదాని నుంచి నేను చదువబోతున్నాను. మొదటి పంచవర్ష ప్రణాళికలో వారు కొంత డబ్బు కేటాయించారు. కొన్ని స్కీములు వేశారు. ఇచ్చిన డబ్బుతగ్గించబట్టి women's department suffer అయినట్లు కనిపిస్తుంది. అది ఏమీ న్యాయం కాదు. ఇక్కడ ఉన్నది మేము ముగ్గురము; ఉన్నవారిలో నోరు కలిగిన వారులేరు.

THE HON. SRI A. B. NAGESWARA RAO.—నలుగురు ఉన్నారు.

SRIMATHI C. AMMANNA RAJA — అవును; నలుగురున్నారు. ఏవిధంగా work చేస్తున్నారో మీకు, మాకూ తెలుసు.

> "A Training institute will be opened in the first year for the purpose of training 30 women welfare organisers for welfare work. In addition to this, Refresher Courses will be held every year for welfare organisers and midwives already engaged in the field at the rate of twenty organisers and 20 midwives per year. This service will meet the needs of field workers."

అని మొదటి సంవత్సరంలో 30 మంది organisers ను train చేస్తామని, training కు ఇతర States కు అయినా పంపుతాం అని, moral hygiene క్రింద కొంత శ్రద్ధ తీసుకుంటామని schemes వేశారు. ఒకటి కూడా first year లో లేదు. అది న్యాయంకాదు. If you educate a man, you are educating an individual. If you educate a a woman, you are educating society" అని ఏవో కబుర్లు చెబుతుంటారు. తప్ప మరిచిపోతుంటారు. వారిని perpectual గా వెనుకకు నెట్టి, మీకు ఏమి తెలియదు కాబట్టి ఎందులోనికి రావద్దనిఅంటే న్యాయంకాదు. It is a vicious circle. మన హృదయాలు మారితే తప్ప వారు పైకి రావడానికి అవకాశాలులేవు. ఇండియా గవర్నమెంటును చూసి అయినా మనం శ్రద్ధతీసుకోవాలి అక్కడ స్త్రీల ఉద్యమాలకు చాలా ప్రాముఖ్యత ఇస్తున్నారు. పెద్ద మొత్తాలు కేటాయిస్తున్నారు. Social Welfare Board అని ఒకటి పెట్టారు. Local గా మనంకూడా తగిన సహాయం చేయకపోతే funds lapse అవుతాయి తగిన శ్రద్ధతీసుకోవాలి. ఏ విధమైన ప్రోత్సాహం లేకపోతే, ఊరికే రమ్మంటారుతప్ప what is it we gain అనే అభిప్రాయం స్త్రీలలో కలుగుతుంది. ఇటువంటి నిరుత్సాహం కల్పించకుండా ప్రోత్సాహం ఇచ్చి వారుకూడా పైకివచ్చి పనిచేసేట్లు నిజమయిన

సేవజరిగేట్లు చూడాలి. ఇదికూడా నేను చెబుతున్నాను. ఇటువంటి డిపార్టుమెంటు అవసరంలేనట్లు చేయాలి మనం. That department must also extinguish itself వారిని మీతో సమానంగా చేసుకోండి విజ్ఞానంలోను, ఏ విషయాల్లోను అన్యాయాలు జరుగకుండా చూడాలి.

నేను పేపర్లలో చూశాను. అనేక ఇబ్బందులవల్ల స్త్రీలు ఆత్మహత్య చేసుకుంటున్నారు. అటువంటివి చాలా cases ఉన్నవి. నిజమే. అది మనరాష్ట్రంలో కాదు. కాని యితర రాష్ట్రాలవారు interest తీసుకున్నారు కాబట్టి ఆ వార్త పేపర్లలో వచ్చింది. గవర్నమెంటు మూలకంగా వారు ఆత్మహత్య చేసుకోలేదు. అలాంటి స్త్రీలను కాపాడ వలసిన బాధ్యత ప్రభుత్వంమీద ఉన్నది.

THE HON. DR. B GOPALA REDDI :—భర్తలను జైలుకు పంపించుదాము.

SRIMATHI C. AMMANNA RAJA :—వారు అంత తేలికగా మాట్లాడితే మేము మాట్లాడం కష్టం. నేను ఎప్పుడూ చూస్తూ ఉంటాను. స్త్రీల గురించి ఏమాట వచ్చినా ఇలాగే తేలికగా అంటూ ఉంటారు. అటువంటి స్త్రీలను shelter homes కు destitute homes కు తీసుకువచ్చి కాపాడవలెను.

MR. SPEAKER —There is a proposal to punish peopel who are responsible. That is what the Hon. Chief Minister says.

SRIMATHI C. AMMANNA RAJA :—ఇబ్బందులున్నచోట destitute women తీసుకువచ్చి " మీరు shelter homes కు రావచ్చును. ఈ work centre లో పనిచేసుకొని మిమ్మల్ని మీరు పోషించుకోవచ్చునని చెప్పవలెను. ఈ అవుసరం ఎంతైనా ఉన్నది.

Women Welfare Department అని రాష్ట్రం మొత్తంమీద ఒకటి ఉంది. మీరు ఆ department కు యిచ్చే సిబ్బంది ఎంత ? Are yon giving her the status of a provincial officer ? Either you must make it complete or you can abolish the department. ఇక Welfare Department ఏమి చేస్తున్నది ? అలంకారానికి ఉంచారా అని కొందరుసభ్యులు హాస్యాస్పదంగా అడిగేటట్లు తయారుచేశారు. ఇది నిజంగా స్త్రీలకు సేవచేయడం లేదు. వారి కళ్ళనీళ్లు తుడవడంకోసం ఈ department పెట్టారా అనిపిస్తున్నది. వారేదో చెప్పడం అందువల్ల నేను ఇక్కడ చెప్పడం కాదు. కనుక వారు అడిగిన minimum demands ఇవ్వవలెను. వారు work చెయ్యడానికి

సౌకర్యములు ఇవ్వవలెను. U. P. లో Women Welfare Officer కు pick-up ఇస్తున్నారు. ఆవిడ తన పనిమనిషిని తీసుకువెళ్ళవచ్చును. ఎంటెసాంపుల్సు తీసుకు వెళ్లవచ్చును ఆవిధంగా ఇక్కడ supply చెయ్యడంలేదు. కావలసిన office staff లేదు. ఎంతమంది టైపిస్టులున్నారు? Stenos ఉన్నారు? అని వాకబుచేయవలెను. ఈ Department గోపాలరెడ్డిగారి department కాబట్టి గోపాలరెడ్డిగారు ఆ department visit చేసి వారి కష్టసుఖములేమిటో, ఆలోచించి ఏమైనా చెయ్యవలెను. ఐదు సంవత్సరాలలో ఈ డిపార్టుమెంటుకు కేటాయించినది ముప్పై లక్షలు మాత్రమే. ఈ కేటాయింపు department అభివృద్ధికి ఏమాత్రము దోహదకారి కాదు.

ప్రభుత్వంవారు విద్యావిషయం సంబంధించినంతవరకు శ్రద్ధతీసుకుంటున్నారు. కాని ఒక చిన్నసలహా ఇస్తున్నాను. Elementary stage లో combined schools పెడితే ఖర్చు తగ్గుతుందేమో! అమ్మాయిలను అబ్బాయిల స్కూలుకు పంపవచ్చును. ఎవరికి అభ్యంతరం ఉండదు. ఈ విధంగా బడులను హెచ్చుచేసినట్లయితే గ్రామాలలో చదువు అందుబాటులో ఉంటుంది. ఇప్పుడు గ్రామాలకు వెళ్లడం కష్టమని చాలామంది ఇన్స్పెక్టింగు ఆఫీసర్లు గ్రామాలకు వెళ్లకుండా తప్పుడు లెక్కలు, అవి చూసి తప్పుడు రిపోర్టులు ఇస్తూ ఉన్నారు. అవిధంగా లేకుండా చెయ్యవలెను.

N. C. C అనేది ఒకటుంది. దాని ఖర్చంతా Central Government వారిస్తారు. ఇది చాల అవసరమైన డిపార్టుమెంటు. మిలిటరీవారినిచ్చి ట్రెయినింగు ఇస్తున్నారు.

THE HON. DR B. GOPALA REDDI:—వారిచ్చే దానికన్న మనం ఖర్చుపెట్టవలసింది ఎక్కువ. వారిచ్చేది నామకార్థం.

SRIMATHI C. AMMANNA RAJA:—మనం ఖర్చుపెట్టుతున్నది ఎక్కువేగాని మనం ఖర్చుపెట్టకపోవడంవలన కేంద్రం వారిచ్చేదికూడా పోగొట్టుకుంటున్నాము. ప్రతి ఒక్క స్కూల్లో పెడితే smartness వస్తుంది. మనకు Private schools లేవు. డెహరాడూన్ స్కూల్లాంటివి మనకిలేవు. కాబట్టి ప్రతి స్కూల్లోనూ, ఒక N. C. C. సెంటరు పెట్టవలయునని. నా కోరిక. Teachers చిన్న, చిన్న స్కూళ్లల్లో, చదువు సరిగ్గా చెప్పడంలేదు. D. E. O. లు వెళ్ళినప్పుడు వారిని కారుల్లోతిప్పి దండలు వేస్తున్నారు. ఇందంతా చెప్పడం నా ఇష్టంలేదు. Inspections, superficial గా చేస్తున్నారు. చదువుచెప్పడం మాత్రం ఏమీలేదు మీ ఇండ్లలో private లేకుండా మీ అమ్మాయిలకు అబ్బా

యిలకు చమవుచెప్పిస్తున్నారా అని నేను సూటిగా అడుగుతున్నాను. బడులలో సరిగా చెప్పకపోవడం ఇంటివద్ద 100 రూపాయలకి private చెప్పడం జరుగుతున్నది. అంతమందీ afford చెయ్యలేరు. అది న్యాయంకాదు. ధర్మఘారమునకు guides కొన్ని ఇస్తున్నారు. అంటే నోట్సు అన్నమాట. మన మీనాదు S. S. L. C కి కూడా నోట్సు కొనకూడదని అంటున్నాము. ఈ గైడ్సుఇస్తే teachers ఎందుకూ అని అడుగుతున్నాను. కనుక ఈ విధానంలో సవరణ జరుగవలసిఉన్నదని నేను కోరుతున్నాను.

Information Department అని ఒకటున్నది. అది ఏమి చేస్తోందో నాకు తెలియదు. ఈశాఖలో ఏమైనా ఫిలిములు తయారుచేశారా ? ఏదైనా డిపార్టుమెంటుంటే అది ఫలానాపని చేస్తున్నదని మనకు తెలియవలెను. దాని కెక్కువ సిబ్బందినిఇచ్చి పనికివచ్చేటట్లు చేయవలెను. ఈ Department కు సిబ్బంది ఏమైనా ఉన్నదా ? బడిపిల్లలకు ఫిలుములేమైనా కావలెనంటే మా దగ్గరలేవు, మద్రాసు నుంచి తెప్పించుకొనవలెనని వారు అంటారు. Department ఉన్న తరువాత అది satisfactory గా పనిచేస్తున్నదని మనకు నమ్మికపుట్టవలెను. కనుక ఈ శాఖ సంతృప్తికరంగా పనిచేసేటట్లు ప్రభుత్వం చూడవలెను. Childrens విషయంలో certified juvenile schools లేనేలేవు. బళ్ళారికి పంపుతూఉన్నారు. అక్కడ కన్నడం నేర్పుతున్నారు. మదరాసుపంపుతే అక్కడ అరవం నేర్పుతారు. వీధులవెంట అనేకమైన కుఱ్ఱవాళ్లు తిరుగుతూఉంటారు. వారు దొంగతనాలు చేస్తారు. అటువంటివారికి work centres or shelterhouses పెడితే వారు మామూలు citizens గా తయారుకావచ్చును.

Famine works జరుగుతూఉంటవి Works వద్దకు తీసుకునివెళ్ళి పని చేయిస్తే నష్టంరాదు. అవసరంఉన్నా లేకపోయినా పెద్ద పెద్ద పర్కులు జరుగుతున్నవి. వీటికి తిరునల్వేలినుంచి, దిండికల్ నుంచి ఎక్కువగా కూలీలు వస్తున్నారు. వారికి బ్రతుకుతెరువు చూపించవలసిన బాధ్యత మనమీద ఉన్నది.

మన దేశంలోఉన్న మిషనరీలను, Health Department లోనికి Medical Department లోనికి తీసుకొనవలెను. Leprosy patients ఎక్కడ చూసినా తిరుగుతూఉన్నారు. వారిని segregate చెయ్యవలెను.

THE HON. SRI A B. NAGESWARA RAO:—మేము రాజమండ్రిలో ఈ సెగ్రిగేషన్ కు ఏర్పాట్లుచేశాము. భోజనం పెడుతూ ఖర్చుకు అణా, రెండణాలిస్తామన్నా కూడా ఎవరూ వచ్చి ఉండే సావకాశం లేకపోయింది. అమ్మన్నరాజాగారు ఆ ప్రయత్నం చేస్తే ప్రభుత్వం తప్పకుండా సహాయం చేస్తుంది.

Srimathi C AMMANNA RAJA :—నాకు తెలుసు. ఇది కష్టమైన పనే. అంటువ్యాధులు వ్యాపించకుండా చెయ్యవలసిన బాధ్యత మనమీద ఉంది. అవసరమైతే penalise చెయ్యవచ్చును. కుష్టు-చాలా ఎక్కువగా వ్యాపించిపోతున్నది. పసి పిల్లలకుకూడా ప్రాకుతున్నది. మనముకూడా శ్రద్ధ తీసుకోనవలెను. ఈ విషయంలో మిషనరీలు ఎక్కువగా పనిచేస్తున్నారు. వారి సహాయంతీసుకొని ఈ సమస్యను tackle చెయ్యవలెను.

Beggars వీధులవెంట తిరుగుతున్నారు. మనము వారికి డబ్బు ఇస్తున్నాము. వారి చేతులనుంచి మనము తిరిగి తీసుకొంటున్నాము. ఈ విధంగా అంటువ్యాధులు వ్యాపిస్తున్నాయి వారికికూడా work centres, concentration camps పెట్టవలెను.

అక్కడ ఒక leprosy clinic పెట్టి, వారు అక్కడికి వెళ్ళేటట్లు చేయవలెను. ఈ విషయాలన్నీ జాగ్రత్తగా ఆలోచించి ఈ అంటువ్యాధి వ్యాపించకుండా చెయ్యవలెను.

SRI M. SATYANARAYANA RAJU :—అధ్యక్షా మహాశయా, సుమారు నెలరోజులనుంచి Budget session జరుగుతున్నది. చాలా ప్రశాంతంగా ఎట్టి కోలాహలం, అల్లరిలేకుండా జరగడం చాలా సంతోషం. ఎందుచేతనంటే ప్రభుత్వానికికూడా చాలా అభివృద్ధికార్యక్రమాలు తలపెట్టి దీనిని ముందుకు నడపాలనే సంకల్పం ఉన్నది. ఆ ప్రకారంగా అందరు ప్రభుత్వపక్షంవారయితేనేం, ప్రతిపక్షంలో వున్నవారయితేనేం, సర్వోదయసిద్ధాంతంలో దేశాన్ని అభివృద్ధిచేయాలని కోరుతున్నాము. కోలాహలం లేకుండా ఈసభ సంతోషంతో ఈబిల్లును ఆమోదించింది. ఈ సందర్భంలో ముఖ్యమంత్రిగారిని, మంత్రివర్గంవారిని కోరేదేమిటంటే ఉన్న ఆర్థికస్థోమతులో ముఖ్యంగా పెద్దచూపుచూచి ఉన్న towns, పెద్దపెద్ద institutions మీద మాత్రమే దృష్టినిల్పక, చిన్నవి, దిగువవున్నటువంటివి అయిన గ్రామాలు, తాలూకాలపైకూడా దృష్టి మరలించమని కోరుతున్నాను. ఎందుచేతనంటే యీ budget సమావేశంలో చాలమంది ప్రభుత్వపక్షం సభ్యులు ప్రతిపక్షసభ్యులు అంతాకలిసి గొప్పవిమర్శనతో ఏకగ్రీవంగా గ్రామాల అభివృద్ధి గురించి తాలూకాలవిషయం మాట్లాడారు. ఆ సంగతి ప్రభుత్వానికి తెలుసును. అందుచేత ఉన్న తక్కువ ఆర్థికంలో, అవకాశాలనుబట్టి హెచ్చుగా గ్రామాదుల గురించి శ్రద్ధవహించి, గ్రామప్రజలకు తగిన అవసరాలుతీర్చమని కోరుతున్నాను. ఇప్పుడున్న పరిస్థితులలో ఏవిషయంలో తీసుకున్నా గ్రామాలలో చాలా యిబ్బందులున్నాయి. ఇది కేవలం ప్రతిపక్షంలో ఉన్నామని విమర్శకోసం అని, మాట్లాడడం లేదు. యథార్థం మాట్లాడుతున్నాను. కొన్నికొన్ని ఊళ్లలో యిప్పటికే

schools లేవు. పోనీ ఉన్న schools బాగా అభివృద్ధిచేస్తున్నారాంటే ఆలాగునా కనపడదు. భవననిర్మాణాలను తదితర బాధ్యతలను గ్రామాలలోని ప్రజలపై పెడుతున్నారు. దానివల్ల ప్రజలు బాధపడుతున్నారు. కొంతమంది కడుతున్నారు. కొంతమంది కట్టలేకపోతున్నారు దానివల్ల కొంత కొరతవస్తున్నది. ఇదివరకు District Board అజమాయిషీ క్రింద వున్న schools చాలమట్టుకు repair లేక పడిపోయే స్థితిలో ఉన్నాయి. అలా పడిపోతాయి అనే భయంతో స్కూళ్లను వరండాలలో పెడుతున్నారు. వీటిని ప్రత్యేకంగా District Educational Officer కు P A కు special officers కు తీసుకువెళ్లి చూపిస్తున్నాం. చూపించినప్పటికీకూడా తగిన funds లేవని చెప్పి వారేమీ చేయలేకపోతున్నారు. ఇటువంటిపరిస్థితులలో అధమం క్రొత్త schools లేకపోయినా ఉన్న schools ను సకాలంలో మరమ్మత్తులు చేయించి ప్రాథమిక విద్య అభివృద్ధిచేయించే ఏర్పాటు చేయించాలని కోరుతున్నాను. తరువాత ఆరోగ్యంవిషయమై చెప్పాలి. గ్రామస్థులకు వైద్యం అందుబాటులో లేక చాలా యిబ్బందులు పడుతున్నారు. పోనీ అందుబాటులో లేకపోయినా ఏ తాలూకా head quarters కో జిల్లా head quarters కో రోగిని తీసుకువెళ్లడానికి communication లేవు. చాలా ప్రమాదమైన జబ్బులు వస్తున్నాయి. ప్రసవసమయంలో స్త్రీలు చాలా యిబ్బందులు పడుతున్నారు. అటువంటిసమయంలో వర్షకాలంలో ప్రజలు కుళ్ళి చావవలసినదే. డాక్టరుగారు రోడ్డువరకు బస్సుమీద వస్తారుగాని గ్రామాలకు రావడానికి యిష్టపడరు. అందుచేత డాక్టరును తీసుకురావడానికి వీలులేదు. రోగిని డాక్టరు దగ్గరకు తీసుకువెళ్లడానికి రోడ్లు లేవు అటువంటి cases చాలా పోతున్నాయి. అందుచేత ఈ పంచవర్ష ప్రణాళికలో ప్రజలలో ఉత్సాహం కలుగజేసేందుకు ప్రభుత్వం గ్రామాలకు సహాకారం యిచ్చి క్లిష్టపరిస్థితులు చక్కబెడతారని ఆశిస్తున్నాను. తరువాత Electricity విషయంలో మంత్రిగారు మాట్లాడుతూ ప్రతిగ్రామానికి current యిచ్చే ఉద్దేశ్యం ప్రభుత్వానికున్నదన్నారు. ఇస్తున్నప్పుడుకూడా కొన్నికొన్ని విషయాలు గుర్తుంచుకోవడములేదు. Construction జరుగుతున్నప్పుడు ఆ దగ్గరున్న గ్రామాలవాళ్లు petition పెడుతున్నప్పుడు current మంజూరుచేయకుండా ఉన్నారు. అలాగాక construction జరుగుతున్నప్పుడు ప్రక్కగ్రామాలవాళ్లు కావాలన్నప్పుడు వారికి సప్లయిచేసినట్లయితే ప్రభుత్వానికికూడా కొంత ఖర్చు కలిసి వస్తుంది. పనవుతుంది. ఆస్థితిలో అక్కడ ఏ transformer వేయాలో, transformer తాలూకు capacity ఎంతవరకు ఉంటుందో ఆలోచించుకొని తగిన equipment సేకరించుకుని వేసినట్లయితే కొంచెం ఖర్చు కలిసివస్తుంది. లేకపోతే extend చేయవలసివచ్చినప్పుడు యిప్పుడున్న చిన్న capacity transformer బదులు పెద్ద transformer తరువాత వేయడానికి installation

Sri M. Satyanarayana Raju] [29th March 1956

charges జాస్తి అవుతాయి. అటువంటి applications ఏమి వచ్చినా అందుకని పల్లెలకు current యిచ్చే ఏర్పాట్లు చేయాలని కోరుతున్నాను. నిన్న సభ్యులు చాల మంది మాట్లాడారు. Electricity installations కి పదేపదేనుబారా ఖర్చు హెచ్చుఅవడంవల్ల Capital expenditure జాస్తి అయి దాని ప్రతిఫలంగా current rates జాస్తి అవుతున్నాయి. ఇదివరకు పైకారా Electric current Madras నుంచి supply చేసినప్పుడు మైసూరు current unit rates మనకేటుకంటే చాలా తక్కువ. మనం Unit కు 0-2-6 యిస్తున్నాం. మద్రాసులో unit rate అంతలేదు. పల్లెటూర్లలో current చేసినప్పుడు ముఖ్యంగా ఆ గ్రామానికి వ్యవసాయఅభివృద్ధికి ఎంత ఉపయోగకరంగా వుంటుందో చూడాలి. Lighting పట్టి luxury కోసమే కాని దాని out turn ఉండదు. production value ఏమీ ఉండదు. Productive value కావాలనుకుంటే agricultural pumping sets వేయవలసివస్తుంది. Agricultural pumping sets వేయడానికి minimum guarantee పెట్టారు. నెలకు 15 రూపాయలు minimum. సంవత్సరానికి 175 యివ్వవలసిఉన్నది cost of production of current జాస్తిఅవుతుంది కాబట్టి అలా నిర్ణయించారు. Installation ఖర్చులు జాస్తి అవుతుంటాయి కాబట్టి cost of production హెచ్చుఅవుతుంది. కనుక Installation charges తగ్గించడానికి అందులో దుబారాతగ్గించాలి. లేకపోతే economic గా ఉండదు. 175 రూపాయలు వేయడంవల్ల Lighting కు వచ్చిన demand కంటే యీ pumping set demand తగ్గుతుంది. ఎందుచేతనంటే యీ 175 రూపాయలు కట్టడం కష్టంగా వుంటుంది. pumping ఉపయోగం వేసవికాలం నాలుగు మాసాలే ఉంటుంది. వర్షాకాలంలో దాని అవసరంఉండదు. 175 రూపాయలు యీ 4 మాసముల పనికే మనం యివ్వవలసివస్తుంది. అందుచేత working expenses లావవుతాయి కాబట్టి రైతుకూడా ముందుకురాలేదు. కనుక rates తగ్గించే ఏర్పాటు చేస్తేనే గాని రైతాంగం pumpsets పెట్టుకోడానికి వీలుండదు. తరువాత Irrigation విషయమై పెద్ద పెద్దవి పెడుతున్నారు. సంతోషమే దానికి ఆక్షేపణలేదు. ముఖ్యంగా కోరవలసినది. గతసంవత్సరం హెచ్చువర్షాలవల్ల చెరువులు తెగిపోయినాయి. Sub-collector కు petitions పెట్టాం. చెరువులు మరమ్మత్తు కాలేదు చాలమట్టుకు applications pending లో వున్నాయి. ఎన్నిచెప్పినా కాలయాపన చేస్తున్నారు. Funds లేవని చెబుతున్నారు. అధమం ఆ తెగిపోయిన చెరువులయినా బాగుచేయించేవరకు వచ్చేవాగులు మరమ్మత్తు చేయించినట్లయితే అధమపక్షం చెరువులలోని నీటిసదుపాయంవల్ల వ్యవసాయం పండించుకోడానికి అవ

కాశం ఉంటుంది కాబట్టి Minor irrigation, యీ చెరువు repairs యివన్నీ చేయాలని కోరుతున్నాను.

జమీందారీ ఏరియాలలో loans తీసుకోవడం చాలా కష్టంగాయున్నది. Lands మీద శిస్తులు, ప్రక్కనున్న తాలూకాలన్నింటికన్నా ఎక్కువగా యున్నాయి. జమీందారీ ఏరియాలలో శిస్తులు ఎక్కువ, కదుపాటరాలు తక్కువగా ఉన్నాయి. దానిమీద ఇప్పుడు ప్రభుత్వమువారు సర్‌చార్జి కూడా వేయబోతున్నారు. అందువల్ల ఇటువంటివన్నీ సర్దుబాటుచేసి, ఎటువంటి లోపాలులేకుండాచేసి, loans వాళ్లకు విరివిగా ఇప్పించే ఏర్పాటుచేయాలని మనవిచేస్తూ ఇంతటితో విరమిస్తున్నాను.

SRI T. LAKSHMINARAYANA REDDI :—అధ్యక్షా, ఈనాడు మన ముందున్న అప్రోప్రియేషన్ బిల్లును బలపరుస్తున్నాను. ముఖ్యంగా మనము deficit బడ్జటులో ఉన్నాము. దీనిని భర్తీచేయలేకపోయినామే అని మన ముఖ్యమంత్రిగారు ఆందోళన పడుతున్నట్లుగా కన్పిస్తున్నది. ఏమీ ఆందోళన పడవలసిన అవసరములేదని నా ఉద్దేశ్యము. మనది under-developed State. మనము exploit చేయవలసినటువంటి resources చాలా ఉన్నాయి. అటువంటప్పుడు ఈ Under-Developed Budget మంచిదనీ, దానికి అట్టే ఆందోళన పడవలసిన అవసరములేదని మనవిచేస్తున్నాను. మనం మద్రాసు రాష్ట్రంనుంచి విడిపోయిన తరువాత సాధించిన ఘనకార్యములు ఎన్నో ఉన్నాయి. అవి అన్నియు ప్రజలందరికీ తెలిసినట్లుగానే ఉన్నాయి. మన రాష్ట్రంలో మనం నిర్మించుకుంటున్న తుంగభద్ర, మాచ్‌ఖండ్, నాగార్జనసాగర్ ప్రాజెక్టులను చూచి సంతోషపడనివాడు ఉండడు, వీటి విషయంలో ఆంధ్ర ప్రభుత్వాన్ని మరీమరీ అభినంధించవలసిన అవసరం ఉన్నది

మనం హైకోర్టును గుంటూరులో ఏర్పాటుచేసి దానిని త్వరితగతిని నడిపించే పద్ధతిని చూస్తే వారిని మరీ అభినంధించవలసి యున్నది. మన ప్రభుత్వం వారు విశ్వనాధశాస్త్రిగారివంటి అనుభవముపొంది, రిటైరుఅయిన జడ్జీలను తీసుకు వచ్చి ఉపయోగించుకుంటున్నారు. చాలా బాగుంది. అందుకు వారిని అభినందిస్తున్నాను.

Separation of Judiciary and Executive ను అన్ని జిల్లాలలో అమలు పరిచి 3 జిల్లాలలో మాత్రం అమలుజరుపలేదు. ధనాభావమువల్ల అమలుపరచకుండా యుండవచ్చును. ఇది చాలా ముఖ్య అవసరమైన reform అని మనవిచేస్తున్నాను. దీనికొరకు మనం బ్రిటిషు ప్రభుత్వం హయాములోనే ఆందో

నలు చేయడం ప్రారంభించాము అటువంటి reform ఈనాటికి ఇంకా కొన్ని జిల్లాలలో లేకపోవడము జరుగుతున్నది. ధనాభావము అనకుండ దీనిని వెంటనే అమలు జరుపవలయునని, మనవిచేస్తున్నాను.

జస్టిస్ ప్రజలకు జరగడమే కాకుండా, జరుగుతున్నట్లు ప్రజలకు కన్పించాలని నా ఉద్దేశ్యం. అలా కానప్పుడు ప్రభుత్వంలో ప్రజలకు నమ్మకము లేకుండా పోతున్నది. Public scandles మనకు బొత్తిగా లేకుండా చేసుకోవడానికి మనం ప్రయత్నము చేయాలి. ఈ మధ్య తూర్పు గోదావరి జిల్లా మండపేట పంచాయితీ బోర్డులో, Executive Officer కొన్ని వేల రూపాయలను దుబారా చేసినారు. వారిమీద దర్యాప్తు ఏమి చేయకుండా ఉండటం చాలా శోచనీయంగా యున్నది.

THE HON. SRI A. B. NAGESWARA RAO :—అది విచారణలో యున్నది.

Sri T. LASHMINARAYANA REDDI :—అటువంటిది చాలా త్వరగా చేసినట్లయితే ప్రభుత్వం చర్యతీసుకోకుండా పోలేదని నమ్మకం కలుగుతుంది. అటువంటిది ప్రభుత్వానికి చాలా అవసరము అని మనవిచేస్తున్నాను.

SRI VAVILALA GOPALAKRISHNAYYA :—అధ్యక్షా, ఈ అప్రోప్రియేషన్ బిల్లుకు డబ్బు ఇవ్వము అంటే సంవత్సరము ఖర్చు గడపకుండా పోతుంది మనకు కేంద్ర ప్రభుత్వమునుంచి అప్పుడప్పుడు గ్రాంట్లు వస్తున్నాయి. ఆ గ్రాంట్సు అన్నింటిలో మనకు 1953 అక్టోబరులో ఆంధ్రరాష్ట్రము వచ్చినప్పట్నుంచీ 1954 వరకు 10 లక్షల రూ॥లు. lapse అయినది. 1954 నుంచి 55 వరకు 10 లక్షల 44 వేల రూపాయిలు lapse అయింది. మొత్తం 21 లక్షలు lapse అయింది. సబ్సిడీలలో 9 లక్షలు lapse అయింది. మనకు చాలా పెద్ద మొత్తము వస్తుంది, అందులో ఈ మొత్తం lapse అవడం ఒక సమస్య కాదు అని చెప్పవచ్చు. మనకు వచ్చిన మొత్తములో 60% వరకు lapse అయిందని అంటే, అది చాలా అన్యాయము అవుతుంది. మనకు వాళ్లు ఇచ్చే loan ను ఉపయోగపరచుకోలేకుండా ఉన్నట్లయితే మరల మనము కేంద్ర ప్రభుత్వంవారిని loan అడిగితే, "క్రిందటి సంవత్సరము ఇచ్చిన దానిని మీరు ఉపయోగపరచుకోలేకపోయారు మరల ఎందుకు" అంటారు. అందువల్ల మన ప్రభుత్వం కేంద్ర ప్రభుత్వమునుంచి యీ గ్రాంటు తెచ్చుకునే ముందు మనం అమలుపరచుకోగలమా లేదా అని చూచుకోవాలి. ఈ గ్రాంట్సు వచ్చేటప్పటికి lapse కావడంలో ఇంకో చిక్కు కూడా వస్తున్నది. ఆఖరు రోజుల్లో works కు permission ఇచ్చి వెంటనే పూర్తి చేయాలి. అందుకు

వారు చేయలేక extension అడుగుతూ ఉంటారు. అందువల్ల అది lapse కాక తప్పడము లేదు.

ఈనాడు ఆంధ్ర దేశములో ఎన్నడూ కానట్లుగా local development works ఉధృతంగా జరుగుతున్నాయి. ప్రజలలో కూడా చాలా ఉత్సాహము వచ్చింది. జనవరి, ఫిబ్రవరిలలో works కు orders ఇస్తున్నారు నెల, 15 రోజులలో పని పూర్తి చేయమంటున్నారు. వారు చేయలేకుండా ఉన్నారు. అందువల్ల ఇంకా ముందుగా works కు orders ఇస్తే పనులు తొందరగా పూర్తి అయ్యేదానికి వీలుంటుంది. బావులకు ఇచ్చే సబ్సిడీలు జనవరి నెలలో ఇస్తున్నారు. ఫిబ్రవరిలో పని పూర్తి చేయమంటున్నారు. అప్పుడు నూతులు త్రవ్వేందుకు వీలు కాకుండా యున్నది. నీరు తోడవలసి వస్తున్నది. అందువల్ల ఆ పనులను ఏప్రియల్, మే, జూన్ లకు గాని పూర్తి చేయలేకుండా ఉన్నారు. ఇంజనీర్లు కూడా వీల్లేదంటున్నారు. దానికి అనేక reasons చెబుతున్నారు. వాటన్నింటినీ కూడా సమన్వయపరచుకొని చేయవల్సిన అవసరం ఉన్నది. పాత రూల్సు, పాత పద్ధతులు పనికిరాకుండా ఉన్నాయి. Board Standing orders availableగా లేవు. Government orders ఏమీ కూడా availableగా లేవు. అందువల్ల ప్రజలలో ఉత్సాహం వచ్చే విధంగా rules చేయకపోతే చాలా చిక్కులు వస్తాయి. కేంద్ర ప్రభుత్వం, రాష్ట్ర ప్రభుత్వం కూడా ఈ ప్రణాళికలకు చాలా ఎక్కువగా ధనం ఖర్చు పెడుతున్నారు. కేంద్ర ఆర్థిక మంత్రి శ్రీ దేశముఖ్ గారు నిన్న ఒక మాట అన్నారు. అది మన రాష్ట్రమునకు కూడా వర్తిస్తున్నదని నా నమ్మకం.

"Nevertheless this very tempo of raising expenditure during the next five years would open up many possibilities of extravagance and waste and it is necessary to keep a still closer watch over such expenditure to ensure that the tax-payer gets the maximum benefit out of the planned outlay. We have been in consultation with the Planning Commission and have come to the conclusion that the best way of dealing with this matter should be to set up a special high-powered committee of Ministers and the Deputy Chairman of the Planning Commission at the Centre to organise a thorough investigation including inspection in the field of the important projects in hand both at the Centre and the States with the

Sri Vavilala Gopalakrishnayya] [29th March 1956

> approval of the National Development Council through specially selected teams. These teams will be composed of officials as well as non-officials specially selected for each group of related investigations and may be assisted by outside experts also.

దానిని ప్రధానంగా ఆలోచించవలసిన అవసరం ఉన్నది. మన రాష్ట్రంలో కూడా దీనిని అమలు జరుపవలసిన అవసరం ఉన్నదని కోరుతున్నాను.

మనం ఏదైనా ఒక పనిని గురించి డబ్బు ఖర్చు చేస్తున్నప్పుడు ఆ డబ్బు ఏ విధంగా ఖర్చుచేయబడుతున్నదో చూచుటకు కొందరిని నియమించినట్లయితే బాగుంటుందేమో అనుకొంటున్నాను. ఈ విషయమై మనం కేంద్ర ప్రభుత్వమును గట్టిగా కోరవలసిన అవసరం ఉన్నది. మనం planning విషయంలో పెద్ద పెద్ద ప్రాజెక్టులన్నీ కట్టబోతున్నాము. మన దేశం ఇప్పుడిప్పుడే అభివృద్ధి చెందినది. మన ఆంధ్ర రాష్ట్రంలో అభివృద్ధి కార్యక్రమాలను నిర్వహించుకోవాలంటే back-ward economy నుంచి బయటపడ్డం చాలా కష్టం. ఇప్పుడు నాగార్జునసాగర్ వగైరా ప్రాజెక్టుల నన్నింటినీ కేంద్ర ప్రభుత్వమే భరించి, మన మందరంకూడా ఏకగ్రీవంగా ఖర్చును ఒట్టి చేశామని తెలియపరచిన విషయం నాకు జ్ఞాపకం ఉన్నది. అయినప్పటికీ మన అందరి అభిప్రాయమును ప్రభుత్వమునకు మనవిచేస్తున్నాను. ఈ N. C. C. నుంచి ఎక్కువ డబ్బు ఖర్చు చేస్తున్నామని చెబుతున్నారు. అదంతా సద్వినియోగం కావాలనే అభిప్రాయం తప్ప వేరే మరో ఉద్దేశ్యంలేదు. ఇప్పుడు camps పెడుతున్నారు. వారికి camps ఏర్పాటుచేసి ఇంకా ప్రోత్సాహం ఇవ్వవలసినదే. కాని ఆ camps లో ఉంటే భోజనం ఎప్పుడో 1930 లోని మా 'C' class జ్ఞాపకం వస్తున్నది. మన మిత్రులు 1921 లోని 'C' class అంటున్నారు అదికూడ ఒప్పుకోవలసినదే. కాని నేను 1921 ని చెప్ప దలచుకొనలేదు. 21 కిని 31 కునూ కొస్తతేడా ఉన్నది. కనుక 31 సం॥పు 'C' class మాదిరిగానే ఉన్నాయని చెబుతున్నాను. దానికి చాలా డబ్బు ఇస్తున్నారు. Daily allowances ఇస్తున్నారు. కాని అది contractors, పై అధికారులు తీసుకొంటున్నారు. అది సద్వినియోగ మయ్యే మార్గం ఆలోచించాలి. ఎక్కువ మంది బాలురు దానిలో ఉత్సాహంతో పాల్గొనేటట్లు ఉండాలి. అంతేకాని N.C.C. లో ఎవరూ చేరవద్దు. దీనిలో చాలా ఇబ్బందులున్నాయని ప్రచారం చేసేటట్లు ఉండరాదు.

అది ఇంకా ఉత్సాహంగా జరిగేటట్లు లెఖ్ఖలను తయారుచేసి ప్రయత్నం చేయుటకు Estimation Committee రేపు ఏర్పడబోతున్నది. దానిని వెంటనే సమావేశపరచి పరిశీలనటువంటి అజమాయిషీ చేయించాలని కోరుతున్నాను.

29th March 1956]

SRI L. LAKSHMANA DAS :—అధ్యక్షా! ఈనాడు గోపాల రెడ్డిగారు చెప్పినట్లుగా మనదేశం ఒక చారిత్రాత్మక ఘట్టంలో నుండి ఇంకొక ఘట్టంలోకి మారుచున్నది. ఆంధ్ర ప్రభుత్వం ఏర్పడిన తరువాత ఆంధ్ర రాష్ట్రంలో అనేక ఘనకార్యములను సాధించినది. ఇది ఎవ్వరూ కూడ కాదనరు. ఈ 5 సంవత్సరములలో మనం శాంతియుత మార్గం ద్వారా ఇంతకంటె అభివృద్ధి చెందగలమనే విశ్వాసం మనకు ఉన్నది. కమ్యూనిస్టు సోదరులు కూడ తమ దౌర్జన్య చర్యలను మానుకొని శాంతియుత విప్లవం ద్వారా ఆంధ్ర రాష్ట్రంయొక్క అభివృద్ధి కొరకై తోడ్పడతారని నేను ఆశిస్తున్నాను Irrigation విషయంలో మన రాష్ట్రం చాల అభివృద్ధి చెందుతున్నది. దానిని గురించి సంజీవ రెడ్డిగారికి ప్రత్యేకాభివందనము లర్పిస్తున్నాను.

దేశం అభివృద్ధి చెందుటకు అన్ని ప్రధాన విషయములలోను పునాదిరాళ్లు వేయడం జరుగుతున్నది. రెండవ పంచవర్ష ప్రణాళికలో శ్రీకాకుళం జిల్లాకు సంబంధించిన వంశధార ప్రాజెక్టును చేర్చడం చాల సంతోషదాయకమైన విషయం. ఒరిస్సా ప్రధానమంత్రిగారు నిన్న పత్రికా విలేఖరులతో మాట్లాడుతూ ఒరిస్సాభాగంలో వంశధారపై ప్రాజెక్టు రిజర్వాయర్‌ను చాల తక్కువడబ్బుతో నిర్మించవచ్చునని సూచించారు. ఈ విషయమై మన ఇంజనీర్లు, ఒరిస్సా ఇంజనీరులు సంప్రదించవచ్చును. ఈ సూచనను ఆంధ్రప్రభుత్వంవారుకూడ బాగా పరిశీలించవలసి ఉన్నది. ఎత్తయిన ప్రదేశంలో ఈప్రాజెక్టును నిర్మించుటవలన శ్రీకాకుళం జిల్లాలోని చాలభాగములకు నీరు అందచేయుటకు అవకాశముంటుంది. ఆంధ్ర భాగంలో ఉన్నటువంటి వంశధారపైన అనేకమైన catchment area లు ఉన్నవి.

వంశధారపైన డాములు, రిజర్వాయర్‌లు నిర్మించుటవలన శ్రీకాకుళం జిల్లా అంతయు సస్యశ్యామలం అగుటకు అవకాశమున్నది, ఈ బడ్జటు ప్రసంగంలో యీవిషయమై అనేకసూచనలు చేసినాను. అవన్నీ పరిశీలించి, వెనుకబడిన ప్రాంతములవిషయంలోను, జమీందారీ ప్రాంతాలలోనున్న మైనర్ ఇరిగేషన్ విషయములోను ప్రత్యేకమైనశ్రద్ధ తీసుకుంటారని నేను విశ్వసిస్తున్నాను.

ఇక విద్యావిషయంలో III Form వరకు ఉచితవిద్యా సదుపాయములను కలుగచేస్తున్నందులకు గోపాలరెడ్డిగారిని ప్రత్యేకంగా అభినందిస్తున్నాను. విద్యా విషయంలో ఎంతడబ్బు ఖర్చయినాసరే వెనుకాడకుండా ఇంకా ఎక్కువ పాఠశాలలను నెలకొల్పాలనే కోరుతున్నాను. Irrigation విషయంలోకూడ తగినంత శ్రద్ధతీసుకొని, ఈ 5 ఏండ్లలో క్రొత్తగా అభివృద్ధినిపొంది ఏ ఇతరరాష్ట్రమునకు తీసిపోకుండా స్వయంసమృద్ధిగా ఉంటూ ఇతరరాష్ట్రములకు తోడ్పడగలిగేస్థితికి తీసుకురావలసినదిగా కోరుతూ ఇంతటితో విరమిస్తున్నాను.

[29th March 1956

SRI S. VEMAYYA :—అధ్యక్షా, ఈ బిల్లును పురస్కరించుకొని కొన్ని విషయములను ప్రభుత్వమువారి దృష్టికి తీసుకొనివస్తున్నాను. 19 గంటలనుంచి సోదరసభ్యులు అనేకవిషయములనుగురించి చెప్పినారని మంత్రిగారన్నారు. కాని మేము ప్రభుత్వంయొక్క దృష్టికి తెచ్చినవిషయాలన్నీ వ్యర్థ మైపోతాయేమో నని బాధగావున్నది. మేము ఏదైనా ఒక allegation తీసుకువచ్చినపుడుగాని ఒక specific విషయంగురించి చెప్పినప్పుడుగాని ప్రభుత్వంవారు విచారించి ఇది ఫలానపరిస్థితిలో వున్నది గాని, దీనివిషయమై ఫలానావిధంగా ఆలోచిస్తున్నామని గాని ఏమీ తెలియజేయుటలేదు. దానినిగురించి మేము ప్రశ్నలువేయడం, cut motions పెట్టడం మున్నగునవన్నీ చేయుటవలన ప్రభుత్వమునకు ఎక్కువపని కల్పించినవారము అవుతున్నాము. కాని ఏమీ ప్రయోజనముండుటలేదు. మన రాష్ట్రంలో ఎక్కువ మంది వ్యవసాయకూలీలున్నారు. రోజురోజుకూ ఇంకా ఎక్కువగా పెరిగిపోతున్నారు. దేశంలోని ప్రజలకు ఇతరవిధమయిన వృత్తులు కల్పించక పోవుటవలన కూలీలసంఖ్య పెరిగిపోవుతున్నది. 1882 వ సంవత్సరంలో 74 లక్షలమంది కూలీలు వున్నారు. 1892 లో 187 లక్షలకు పెరిగింది. 1921 వ సం.లో 2,15 లక్షల మంది వున్నారు. 1931 వ లెక్కలప్రకారం 3,33 లక్షలున్నారు. 1940 వ లెక్కలప్రకారం 4 కోట్లు వున్నారు. ఇప్పటి లెక్కలప్రకారం దేశం మొత్తం మీద 4½ కోట్ల కూలీలు వున్నట్లు తెలుస్తున్నది Planning విషయంలో landless labourers కుగాను plan లో చాలా తక్కువమొత్తమును కేటాయించినారు. దీనినిబట్టి కేంద్రప్రభుత్వంగాని రాష్ట్రప్రభుత్వంగాని వ్యవసాయ కూలీలవిషయంలో వారిని అభివృద్ధిలోనికి తీసుకొనివచ్చుటకు తగినకృషి చేయుటలేదని ఖచ్చితంగా తెలుస్తున్నది వ్యవసాయకూలీలు దినదినాభివృద్ధి గాంచుతున్నారు. వారికి పని దొరకుటలేదు. ఇతరవృత్తులు లేనికారణంవలన వారు బాధపడడం జరుగు తున్నది. Planning Commission ఇచ్చినటువంటి రిపోర్టు చూచినట్లయితే మన ఆదాయంలో నూటికి 50 వంతులు వ్యవసాయంపై ఆధారపడినదని తెలుస్తున్నది.

వ్యవసాయాధారం లేకపోతే జాతీయాదాయం పెరుగుటకు ఏ మాత్రము కూడ సావకాశంలేదని తెలుస్తున్నది. ఇండియా ప్రభుత్వంగాని, రాష్ట్రప్రభుత్వం గాని వ్యవసాయకూలీల అభివృద్ధికొరకు తగినపథకములు వేయుటలేదని మనవి చేస్తున్నాను. Highest Income 691, North-West India లో ఉన్నది. Lowest Income 380, South India లో ఉన్నది. Agriculture income per capita 104. National income 264 రూ॥లు ఉన్నట్లు తెలుస్తున్నది కాబట్టి Agriculture labour విషయంలో చాలా తక్కువగా ఉన్నది. దేశం మొత్తంమీద South India లో అన్నిటికంటే తక్కువగా ఉన్నది. దీనిని అభివృద్ధి చేయుటకు, socialistic pattern of society లో

29th March 1956] [Sri S. Vemayya

చెప్పినటువంటి దానిమీద ఎక్కువగా కేంద్రీకరించకపోవడంవలన హెచ్చుజనాభా కల్గినటువంటి ప్రదేశములలో తగినటువంటి పథకములు వేసేవారి సాహాయం పొందుటకు ప్రభుత్వం వెనుకాడుతున్నది.

అందులో cottage industries ని గురించికూడా చెప్పారు. కాని అవన్నీ కూడా మన రాష్ట్రానికి చాల తక్కువగా వర్తిస్తాయని, దాని కేటాయింపుకూడా చాల తక్కువగా ఉన్నదని నేను మనవి చేస్తున్నాను. వ్యవసాయకూలీల విషయంలో under-employment ఎక్కువగా కనబడుతోంది. Survey report ను బట్టి చూస్తే 150 రోజులుమాత్రమే వారికి పనిఉంటుందని అందులోఉంది. కాని అది correct కాదని నేను మనవిచేస్తున్నాను. మరికొన్ని reports లో 3 months hard labour, 9 months idleness అనికూడా నమోదుచేశారు. ఈ under-employment ను నిరోధించడానికి సరైనటువంటి పథకంలేదని దానిని గురించి ప్రభుత్వం వెనుకాడుతున్నదని నేను మనవిచేస్తున్నాను. Land reforms వచ్చినట్లయితే వీరిపరిస్థితి కొంతవరకు బాగుపడుతుంది. Land reforms రాకపోయినప్పటికి వాళ్లను భూమినుంచి వెళ్ళగొట్టకుండా రక్షణ కలిగించేదానికి ప్రభుత్వం ఏమీచర్యతీసుకోవడంలేదు. అందువల్ల వ్యవసాయకూలీలలో నిస్పృహకలుగుతున్నదని నేను మనవిచేస్తున్నాను. కేంద్రప్రభుత్వం పంపించినటువంటి కనీసవేతనాల చట్టాన్ని అమలుపరచాలని 1948 వ సంవత్సరంనుంచి చెపుతున్నాము. ఎక్కడో 14 గ్రామములలో అమలుపరచామని చెప్పుతున్నారుగాని అవి ఎక్కడా కనపడడం లేదు. అది కేవలం కాగితాలమీద ఉంటుందిగాని రాష్ట్రవ్యాపకంగా చేసేదానికి ప్రభుత్వం ఎలాంటిచర్య తీసుకోలేదు. అట్లాగే 1926 సంవత్సరం తరువాత ఇవన్నీ కూడా Weights and Measures Act వలె dead letters గా ఉంటున్నాయిగాని implementation ఎంతమాత్రంకూడా జరగడంలేదు. దానినిగురించి ప్రభుత్వం ఏలాటిచర్య తీసుకోవడంలేదు. అదేవిధంగా హరిజనుల విషయంలో ఆర్థికంగా వారికి సహాయపడాలని మన constitution లోకూడా ఉన్నది. ఇంతకుముందు British Government ఉన్నప్పుడు వ్యవసాయకూలీలు ఎక్కువగా ఉండాలి కాబట్టి వాళ్లకు కొంతభూమి రిజర్వుచేసి ఇచ్చేవిధానాన్ని అవలంబించాలని చెప్పినది. ఇప్పుడుకూడా అది అమలులో ఉన్నది. Board Standing Orders 15, 38 paragraphs లో certain percentage of lands వాళ్లకు రిజర్వు చేయాలనిఉన్నది. ఇంతకుముందు రిజర్వుచేసినటువంటిది ఆరు లక్షల ఎకరాలభూమి ఉన్నది. ఇవన్నీకూడా వాళ్లచేతుల్లో లేకుండా ఇతరులచేతులలో ఉన్నాయి. దానిని resume చేసి ప్రభుత్వము మరల వ్యవసాయకూలీలకు ఇవ్వవలెనను చట్టం ఉన్నప్పటికీ మా జిల్లాలలోని కొవ్వూరు, అల్లూరుఫిర్కాలలో ఇవి అమ్ముకోవడం

జరిగింది. దానిని ప్రభుత్వదృష్టికి తీసుకునవచ్చినప్పటికి ఎలాటిచర్య తీసుకోలేదు. ప్రస్తుతం ఇస్తున్నటువంటి assignment లో కూడా వాళ్ళకు ఏ విధమైన కేటాయింపుకూడా జరగడంలేదు. వీటన్నిటిని ప్రభుత్వం దృష్టిలో పెట్టుకొని Board Standing Orders లో ఉన్నటువంటి విధానాన్ని అవలంబించి ఇతరులతో competition లేకుండా చేయాలని మనవి చేస్తున్నాను. అదేవిధంగా కార్మికుల విషయంలో వారియొక్క నిరుద్యోగ సమస్యగురించి అనేక పర్యాయాలు ఉన్నాయి. అనేక విషయాలలో కార్మికులకు Award pass చేసేటటువంటి stage లో కూడా ఆలస్యం జరుగుతున్నది. వాళ్ళకి ఏదైనా తగాదావచ్చినపుడు అప్పుడప్పుడే పరిష్కరించే పంధాలు లేక పోగా award pass చేసేటటువంటి stage లో అది ప్రభుత్వానికి వచ్చినప్పుడు సంవత్సరాలపర్యంతముకూడా ఆలస్యము అవుతున్నది. త్వరగా pass చేసేటటువంటి విధానం అవలంబించి, ఆలస్యము ఎందుకు జరుగుతున్నదో ఆలోచించాలనికూడా మనవిచేస్తున్నాను.

N.G.O లను గురించి అనేకసార్లు చెప్పాను. ఇక్కడున్నటువంటి చిన్న ఉద్యోగస్థులు, peons విషయమై ఒకటి, రెండు విషయాలు ప్రభుత్వదృష్టికి తీసుకువస్తున్నాను. Peons overtime పనిచేస్తారు. ఒక officer అయినట్లయితే 11 గం॥లకు ఆఫీసుకువచ్చి సాయంత్రం 5 గం॥లకు వెళ్ళిపోతాడు. Peons అలా కాకుండా ఉదయం నిద్రలేచిరావడం, రాత్రి 9 గం॥లకు ఇళ్ళకుపోవడం జరుగుతోంది. ప్రస్తుతం ఇక్కడ Legislature లో జరుగుతున్న విషయం members అందరికీ తెలుసు. ఉదయం 8½ గం॥ మొదలుకొని రాత్రి 8 గం॥ల వరకు staff యిక్కడే ఉండిపోవలసివస్తున్నది. వాళ్ళకు జీతాలు తక్కువని అందరికీ తెలుసు. కొన్ని department లలో extra duty చేసినందుకు, holidays లోను ప్రత్యేకమైన allowance లు ఇస్తున్నారు. కాని ఇక్కడ ఉండేటటువంటి వాళ్ళకు అవిధంగా ఇచ్చేటటువంటి order లు ఉన్నాయో లేదో నాకు తెలియదు. కాని మొన్న session జరిగినప్పుడు staff కు, peons వగైరాలకు overtime allowance ఇస్తారనే నేను ఆశిస్తున్నాను.

THE HON. DR. B GOPALA REDDI :— ఇస్తున్నారని చెప్పి Secretary గారు చెప్తున్నారు.

SRI S. VEMAYYA:—Co-operative movement తీసుకొన్నట్లయితే co-operation అంతా అభివృద్ధిచేస్తున్నాము అని అన్నారు. కేంద్రప్రభుత్వంనుంచి వచ్చిన కేటాయింపులోను మన plan లోను ఎక్కువ డబ్బు దీనిక్రింద కేటాయించడం జరిగింది. Co-operative movement లో ఇప్పుడు జరుగుతున్న

దానినిబట్టి, ఇది co-operative movement అని అనడానికికూడా సందేహం వస్తున్నది. అందరినికూడా సమానంగా తీసుకురావాలనే ఉద్దేశ్యంలోనే ఈ co-operative societies పెట్టబడినాయి. ప్రస్తుతం ధనవంతులచేతులతోను, పెత్తనంచేసేటటువంటి వాళ్లచేతులలోను co-operative societies ఉన్నాయి. పేదరైతులు అందులో చేరడానికి ప్రతిబంధకంగా ఉంది. చెరినటువంటివాళ్లు అక్కడే తిష్టవేసుకొని కూర్చుంటున్నారు. ఇప్పుడు co-operative societie లో whole sale stores ఉన్నాయి. అందులో ఎవరినో కొందరిని కావాలని తీసుకోవడం, accounts uptodate గా లేకపోవడం audit సరిగా జరగకుండా ఉండడం మొదలైనవన్నీ ఉన్నాయి. అవన్నీ కూడా మళ్లీ మార్కెటింగు soctiesల రూపేణా కనపడుతున్నాయి. కాని ఇవన్నీ కూడా కొంతమందిచేతులలోనే ఉంచబడుతున్నాయి. ఇతరులను అందులో చేరకుండాచేయడం జరుగుతుంది. Co-operative movementను బాగుచేయాలన్నట్లయితే ఇవన్నీ సవరించడమే కాకుండా అందరికీ అందుబాటులో ఉండేటట్లుగాను ప్రతిఒక్క member కూడా చేరాలంటే చేర్చుకునే విధానాలుకూడా ఉండాలి. ఇంతవరకు కొంతమందిచేతులలోనే పరిమితమై, డబ్బు ఉన్నటువంటివాళ్లు, పెత్తనం చలాయించేటటువంటివాళ్లు పలుకుబడిగలవాళ్ల చేతులలోనే ఈ society లు ఉండడం జరుగుతోంది. ఇటువంటి వాళ్లనందరిని societyలకు దూరముగా ఉంచినట్లయితే ఈ సొసైటీలు బాగుపడడానికి అవకాశం ఉంటుంది. గనుక దానికి తగినటువంటి Legislatureను ప్రభుత్వంవెంటనే తీసుకొచ్చినట్లయితే దానియొక్క ఉపయోగం కనపడుతుంది లేకపోతే co-operative movement పేరుకేగాని అది సార్థకంకాదని మనవి చేస్తున్నాను. ఇందులో కేటాయించబడినటువంటి మొత్తం అంతాకూడా ఎక్కువ భాగం దుబారాఖర్చు అయిపోవడం లేకపోతే కొంతమంది చేతులలో మునిగిపోవడం జరుగుతోందిగాని ప్రజలకుమాత్రం అందడంలేదు. దానినిగురించి ప్రభుత్వం తగినటువంటిచట్టాన్ని తీసుకురావడమేకాకుండా, కొంతమందిచేతులలో మాత్రమే ఉంచేవిధానాన్ని తొలగించి అందరికి అందుబాటులో ఉండేటట్లు చేయాలని మనవిచేస్తున్నాను. ఈ Co-operative movement ఎక్కువగా societyల పరంగా వస్తుంది. ఈనాడు ప్రభుత్వం F.L.C. Society అనేపేరుతో ఇస్తున్నారు. అందులో Temple lands కూడా society లకు ఇవ్వాలి. 5 వేలుకాకుండా 50 వేల వరుంబడి వచ్చినప్పుడుకూడా 2 వేలు 3 వేలకంటే అదనంగా రాదని లెక్కలు చూపించేవి మన composite state లోనే అనేకం ఉన్నాయి. ఇటువంటి నిర్దిష్టమైనటువంటి లెక్కలుపెట్టడం సబబుగాదు. Co-operative movementను అభివృద్ధిచేయాలన్నపుడు తప్పకుండా ఈభూములను co-operative societiesకే ఇవ్వాలి.

Sri S. Vemayya] [29th March 1956

హరిజనుల ఉద్యోగాలవిషయంలో అనేక department లలో mil representation కనబడుతోంది. Gazetted ఉద్యోగస్థులలో హరిజనులసంఖ్య చాల అల్పంగా ఉన్నది. రాజ్యాంగంలో ఉన్నటువంటిదానిప్రకారం వారు సక్రమంగా పనిచేయడంలేదని అంటున్నారు. కాని హరిజనులుకూడా honest గా ఉద్యోగాలు చెయ్యగలరని నేను మంత్రిగారికి హామీ ఇస్తున్నాను. దానినిగురించి దర్యాప్తు చేయాలనికూడా నేను మనవిచేస్తున్నాను.

Planning విషయంలో ఒక మాట చెప్పవలసిఉన్నది. ఇది people's plan అని చెప్పారు. ఇది people మీద సవారిచేసే plan గా కనబడుతోంది గాని నిజంగా people's plan గా కనబడడంలేదు. ఎట్లా అంటే మేము 50% ఇప్పుడు ఇస్తున్నాము. మీ ప్రభుత్వముకూడా వీటిపైన సహాయం చేయాలని చెపుతున్నారు. Contractors విషయంలో అవకతవకలు వచ్చినపుడు ప్రజా సహకారం ఇవ్వడంలో technical people వాళ్లకు అందుబాటులో లేకుండా అనేక ఇబ్బందులు పెట్టడం జరుగుతోంది అంతే కాకుండా contract ఒకరికి ఇచ్చినపుడు ఇంకొకరిమీద వారికి interest ఉన్నట్లయితే పాత వారిని తీసివేసి క్రొత్త వారికి ఇవ్వడం జరుగుతోంది. ఈ విధంగా కొండపల్లి High School construction విషయంలో జరిగింది, చేసేటటువంటి పనిని ఆపించి ఇంకొకరికి ఇవ్వడం జరిగింది. అటువంటివి జరిగినపుడు ఇది people's plan అని ఎలా అనిపించుకుంటుంది. ఉద్యోగస్థులమీద సవాలు చేసేటటువంటి ప్లాన్ అని అనిపించుకొంటుంది. గాని people's plan గా కనబడడంలేదని నేను మనవి చేస్తున్నాను.

దీనిలో ముఖ్యంగా check up లేకుండా ఉన్నది. మాకు పనిలేదని అనేక చోట్ల వాళ్లు చెప్పుతున్నారు. వారు పనిలేకుండా pension తీసుకొనేటటువంటి వ్యవహారాలుకూడ కన్పిస్తున్నాయి. C. D. Blocks లో గాని, Extensions లో గాని సరియైనటువంటి అజ్మాయిషీ లేదు. చాలా డబ్బు దుబారా అవుతున్నదని మనవిచేస్తున్నాను. ముఖ్యంగా ఉద్యోగస్థుల విషయంలో రెండు మాటలు చెప్పు తున్నాను. P.W.D. డిపార్టుమెంటులలో గాని, ఇతర డిపార్టుమెంటులలో గాని, ముఖ్యంగా Gazetted ఉద్యోగస్థులు, అక్కడ Composite State నుంచి మన State కు వచ్చారు వాళ్లలో అనేక మందిమీద grave charges pending లో ఉన్నాయి. అటువంటి వారిని ఇంకా మన రాష్ట్రంలో ఉంచుకోవడం సబబు కాదని చెపుతున్నాను. మద్రాసు రాష్ట్రంలో నుంచి వాళ్ల మీద charges ఉన్నప్పటికిని, వాటిని చాలా light గా తీసుకొని ఇక్కడ వారిని continue చేయడం ఏ మాత్రం సబబుకాదు. కనుక వెంటనే విచారణ జరిపించి అటువంటి

ఉద్యోగస్థులపై ఉన్న chargeల మీద సరియైనటువంటి Orders Pass చేసి, అటువంటి వారందరిని పంపించివేస్తే మన planలు బాగా జరుగుతాయని నేను మనవిచేస్తూ ఇంతటితో విరమిస్తున్నాను.

Sri P. BASI REDDI.—Mr. Speaker, Sir, I support the Bill, and in doing so I wish to invite the attention of the Government to what I consider to be a very glaring injustice in the levying of water tax on wet lands in the State. It is a well known fact that the incidence of water tax on land fed by river and spring channels is viewed as a most unjust thing obtaining in State I would not be referring to this matter over again, had Government met the criticism repeatedly levelled against it in this House. I referred to this matter in the course of my speech last year during budget discussion and Mr. Thimma Reddi most vehemently pleaded for the abolition of this tax in the course of the debate on Land Revenue Demand this year. But unfortunately there was no reply for it from the Government on every such occasion. Then there was also an interpellation put last year in respect of this matter and the answers given then by Government were evasive and wholly unsatisfactory. It is under these circumstances that I think it necessary to refer to this matter over again now. I submit there is absolutely no moral justification for the Government to continue to levy this tax in the State. My reasons are as follows. Firstly, it is the ryots that toil in these channels day after day throughout the year and maintain them. Each family of the ryots contributes on an average about Rs. 100 annually towards the maintenance of these channels, and Government do not spend anything; they do not pay even a single pie towards the maintenance of these channels, and yet a water tax at the rate Rs. 10 to Rs. 15 per acre on those lands is levied. The poor

Sri P. Basi Reddi] [29th March 1956

ryot is thus asked to pay this tax even though the channels are maintained by them exclusively, Government spending nothing on them! Compare this rate with the water rate obtaining in respect of lands under channels exclusively maintained by the Government! It is only six rupees, Sir, So it means that on lands under channels which are exclusively maintained by the ryots the rate is double the rate levied on lands under channels which are exclusively maintained by the Government. This is a very anomalous position and this anomalous incidence of tax is not capable of any explanation on any rational basis. It must have come about in the following way according to my opinion: Originally the Government must have been maintaining both sets of channels exclusively and the cost of maintaining river and spring channels must have been necessarily much higher than the cost of maintaining Government channels like the Kurnool-Cuddapah Canal and similar other Government channels. Naturally the incidence of tax in respect of lands under river and spring channels was higher than the incidence of tax in respect of other lands. But then, Sir, the river channels needed constant repairs and the need could not brook the notorious Government delays in the matter of execution of repairs to these works. So the ryots had perforce to do maintenance work themselves in order to save their crops from fading away. When once the ryots began to do the repairs themselves, Government must have become increasingly indifferent towards the maintenance of these channels. Eventually the whole lot of repairs must have come to be done by the ryots, while Government continued to levy the rate of water rate at the original rate! So this is the only way how this anomalous incidence of tax could be explained. It is incapable of any other explanation according to

me, Sir. So, when the Government ceased to do the repairs work they naturally lost the corresponding right to levy the tax in respect of these lands. But somehow unfortunately the tax continues to be levied in spite of the agitation going on for the last four or five decades The Government of the composite Madras State appears to have recognished the unjustness of this tax and abolished this tax in the district of Anantapur about four of five years ago. But then, when the question was put to the Government last year, I think, the Hon. Sri Kala Venkata Rao intervened and said, that because there was an agitation from that district the tax had to be abolished. It is a very strange answer for a responsible Government to give. It means that agitation pays even bad dividends from this Government. If the tax was bad for Anantapur district it is equally bad no more and no less in the other areas in the State. There are absolutely no grounds on which the conditions in Anantapur district in respect of these lands under channels could be distingushed from the conditions obtaining in respect of channels obtaining elsewhere in the State. Therefore I submit this answer impliedly concedes the unjustness of the continuance of the levy of this tax. Then, there is no constitutional justification either fer the continuance of this tax. The continuance of this tax continually violates the provisions of the Constitution of India. It offends Article 16 of the Constitution, which guarantees unto every citizen the fundamental right of equality before the law. I submit, Sir, there is absolutely no equality in respect of this matter. It has been abolished in Anantapur district and it has not been abolished elsewhere in spite of repeated requests. Of course lawyers are criticised for pointing out such things. It is our unfortunate lot. But we are aware that a proper enforcement of the rights and a fulfilment

of the obligations under a democratic set-up of things is absolutely necessary for a successful working of democracy. Therefore we continue to do these things, in spite of cynical attacks on us, in the interests of democracy. The tax is shown to be both unjust and unconstitutional, and I therfore very earnestly appeal to the Government in the name of justice and in the name of the Constitution to abolish this tax forthwith. I have done, Sir, and I am grateful to you, Sir, for giving me a chance to speak.

Mr. SPEAKER :—Article 16 deals with equality of opportunity for public employment, and not taxation. Article 14 deals with equality before law and equal protection of law.

Sri P. BASI REDDI :—I may be mistaken with regard to the number of the particular Article but still the fundamental right is there.

Mr. SPEAKER :—By taxation Government are protecting.

SRI G. YELLAMANDA REDDI :—అధ్యక్షా, ఈ 20 రోజుల నుంచిజరిగిన చర్చల సారాంశమంతాకూడ మన మంత్రులు విన్నారు. ఈ సంవత్సరములో ఇదివరకు చెప్పిన విషయాలన్నీ మళ్ళీ ఇక్కడ చెప్పడంలేదు. అయితే 20 రోజులు ఇంత డబ్బు ఖర్చుపెట్టి ఈ సభలో చర్చలు జరగడం అంటే, ఈ చర్చలయొక్క సారాంశము మంత్రులు తప్పకుండా శ్రద్ధగా ఆలోచిస్తారని మన మంతాకూడ ఆశిస్తున్నాము. కాని, వాటినిగురించి మంత్రివర్గము ఎంతవరకు ఆలోచించారో తెలియదు. గతములో మంత్రి విశ్వనాథంగారు సభ్యులు చేసినటువంటి సూచనలన్నీ పూర్తిగా పరిశీలించి, తగువైనవాటికి ప్రభుత్వము ఏమిచేస్తుందో సమాధానముకూడ పంపుతామని అన్నారు. ఇప్పుడు యీ ప్రభుత్వము ఆవిధంగా సమాధానము పంపవలసిందని కోరుతున్నాను. ఒకవేళ సమాధానము పంపలేకపోయినప్పటికి, ఇప్పుడు సభ్యులు ఇచ్చిన సూచనలు 50 లేక 100 కంటే మించి ఉండవనుకొంటాను. ఈ చర్చల సారాంశము పరిశీలించి, ఏఏ డిపార్టుమెంటు గురించి ప్రజానీకము ఏరీతిగా అభిప్రాయపడుతున్నదో, అది మంత్రివర్గము గమనించి అందుకు ఏవిధమైన చర్యలు తీసుకోవాలో ఆలోచించవలసిన

అవసరమున్నది ఆరకంగా చేయకుండా తమకు ఇష్టమైందిమాత్రము అమలు జరుపుతూవుంటే, ఈ సభయొక్క చర్చల సారాంశము వృధా అవుతుంది. కాబట్టి తప్పకుండా మంత్రివర్గము ఈ విషయాలన్నీ పరిశీలించి వివిధశాఖలలోను సభ్యులు ఏఏ సూచనలైతే చేశారో, వాటినిగురించి ప్రభుత్వము ఏ రకంగా పరిశీలించి ప్రజలకు సహాయముచేయవలెనో అది ఆలోచించి అటువంటి కార్యక్రమము తప్పకుండా అమలు జరుపుతారని నేను ఆశిస్తున్నాను.

తరువాత, మన ప్రభుత్వము ఇక్కడ తలపెట్టినటువంటి అనేకపనులు విషయంలో, అవి sanction అయిన మూడు, నాలుగు సంవత్సరములకుగాని ఆపనులు ప్రారంభించడం జరుగదు. అటువంటివి అనేక ఉదాహరణలు ఉన్నాయి. ప్రభుత్వము ఒక్కసారి ఒక పనికోసం కొంత ముత్తం ప్రత్యేకించి ఆపని చేయాలని ఆలోచించినప్పుడు వెంటనే ఆ పని పూర్తిచేయడానికి ప్రభుత్వము తప్పకుండా శ్రద్ధ తీసుకోవలసిన అవసరమున్నది. ఆ రకంగా తీసుకొన్నప్పుడే మనము అనుకొన్నపని సకాలములో పూర్తిచేయగలుగుతాము. తరువాత ఇక్కడ శాసనసభ్యులు, ప్రభుత్వపక్షమువారుగాని, ప్రతిపక్షమువారుగాని, చెప్పేటటువంటి విషయాలకును, ప్రభుత్వ యంత్రాంగములో జరిగే విధానాలకును సమన్వయంకుదరడంలేదు. ప్రభుత్వ ఉద్యోగస్థులు ప్రజలయొక్క ధోరణిలో ఆలోచించడంలేదు. వారు ప్రజల ధోరణిలో ఆలోచించడమనేది ఇంకా నేర్చుకోవాలి. అంతేకాకుండా, ప్రభుత్వ departmentsలో ఉన్నటువంటి red-tapism మనము పూర్తిగా తొలగించక పోయినట్లయితే, పనులు సక్రమంగా నెరవేరవు. అందులో మనము రెండవ పంచవర్ష ప్రణాళికను ప్రారంభిస్తూ పెద్ద పెద్దపనులు చేయాలని ఆలోచిస్తున్నప్పుడు, ప్రభుత్వ యంత్రములో తీవ్రమైనటువంటిమార్పు మనము ప్రవేశపెట్టనిదే ప్రజలసహకారము ప్రభుత్వయంత్రము తీసుకోడానికి ప్రయత్నం చేయనిదే పనులు సక్రమంగా నెరవేరవు అని మనవిచేస్తున్నాను. ఈ విషయమే మన అసెంబ్లీలో ప్రతిధ్వనించింది. ఈ విషయాన్ని ప్రభుత్వము శ్రద్ధగా ఆలోచించవలసిన అవసరమున్నది. ప్రభుత్వ యంత్రములో ఈలాంటి మార్పు తీసుకురావడానికి ఇంతవరకు మంత్రివర్గము ఏలాటి ప్రయత్నం చేయలేదు. ఈ రెండవ పంచవర్ష ప్రణాళికను జయప్రదంగా చేయవలెనని మనము ఆశించినప్పుడు ఇకముందైనా మంత్రివర్గము ఈ విషయము జాగ్రత్తగా ఆలోచిస్తారని నేను మనవిచేస్తున్నాను.

తరువాత, మొదటి పంచవర్ష ప్రణాళికకు సంబంధించి అనేకపనులు ప్రారంభించబడి యీ మార్చినెల ఆఖరుకు ఆ ఖర్చు అంతా పూర్తికావలసియున్నది. కాని చాలాపనులు పూర్తికాలేదు. మార్చినెలలో sanction చేసినటువంటి పనులు కొన్ని వున్నాయి. అవి మార్చినెలాఖరులోపల పూర్తి కావడానికి వీలులేదు.

Sri G. Yellamanda Reddi] [29th March 1956

ఇవన్నీ పూర్తి కావాలన్నప్పుడు ప్రభుత్వము ఈ మొదటి పంచవర్ష ప్రణాళిక గడువు కనీసం ఏప్రిల్ వరకైనా పెంచవలసిన అవసరమున్నది. ఒక నెల్లూరు జిల్లాలోనే 4, 5 లక్షల రూపాయలయ్యేటటువంటి పనులు ఏప్రిల్ నాటికిగాని పూర్తి కావు. అందువల్ల మన రాష్ట్రంలో ప్రభుత్వము ప్రత్యేకించినటువంటి ఆ డబ్బును మనము వినియోగించాలి అనుకొన్నప్పుడు ప్రారంభించినటువంటి పనులను పూర్తిచేయడానికి కనీసం ఏప్రిల్ వరకైనా గడువు పెంచవలసిన అవసరమున్నది. కనుక యీ విషయంగురించి మన ప్రభుత్వము తప్పనిసరిగా ఆలోచించి కేంద్రప్రభుత్వమునకు తెలిపి ఏప్రిల్ నెల ఆఖరునకు గడువు పొడిగించేటట్లుగా ప్రయత్నం చేయవలనని కోరుతున్నాను.

తరువాత Railway Lines విషయంలో, నెల్లూరు ఖాజీపేట line గురించి ప్రభుత్వము శ్రద్ధగా పనిచేస్తున్నదని చాలాసార్లు చెప్పారు. కాని మన మంత్రి వర్గము దీని విషయమై తగినంత శ్రద్ధతీసుకోలేదని స్పష్టంగా నేను అభిప్రాయపడుతున్నాను. ఎందువల్లనంటె, కేంద్రప్రభుత్వము ఈనాడు రెండవ line తీసుకోవడానికి పూనుకొన్నది. అంటే, ఈ line పూర్తిగా వదలివేశారన్నమాట. ఈ విషయమై మంత్రివర్గము ప్రత్యేకంగా శ్రద్ధ తీసుకొని ఉన్నట్లయితే, మనకు ఇది వచ్చిఉండేది. ఇప్పటికైనా దానియడల ప్రత్యేకంగా కృషిచేయవలసిన అవసరం ఉన్నది ఎందువల్లనంటే, ఎలాంటి రవాణా సౌకర్యములులేని 2, 3, వందల మైళ్ల ప్రదేశానికి ఈ line వల్ల ప్రయోజనం కలుగుతుంది. అందువల్ల ఇది చాలా ముఖ్యమైన విషయము. కనుక మంత్రివర్గము తప్పకుండా ఈ విషయంలో ఇకనైనా ప్రత్యేకశ్రద్ధ వహించవలెనని నేను మనవిచేస్తున్నాను.

ఇక, నాగార్జునసాగర్ గురించి ఒక విషయం మరల ఒకసారి జ్ఞాపకం చేయవలసి యున్నది. కుడి కాలవ విషయంలో, ఇప్పుడు దాన్ని Engineer investigation చేసినతరువాత final గా Planning Commission వారు నియమించబోయే కమిటీ దానికి alignment select చేస్తుందని వింటున్నాము. ఈ సందర్భంలో మన మంత్రివర్గమువారు డబ్బు ప్రధానంగా చూడకుండా, ఎక్కువ ఆయకట్టు వచ్చి, దానివల్ల maximum benefit వచ్చే విధంగా ఆ alignment తీసుకొనేటట్లు మంత్రివర్గము ఇప్పటినుంచీ కృషిచేయవలెనని కోరుతున్నాను. తరువాత దానికి రెండు దశలవారిగా డబ్బు sanction చేశారు. అట్లు గాకుండా, పని రెండు సంవత్సరములలో పూర్తిచేసినప్పటికినీ, దానికి డబ్బు మాత్రం ఒకేసారి sanction చేసేటట్లు చూడవలెనని కోరుతున్నాను. లేకపోతే పని మధ్య మధ్యలో ఆగిపోయే ప్రమాదం ఉన్నది కాబట్టి తప్పని సరిగా మంత్రి వర్గము [illegible] విధంగా చేయుటకు కృషిచేస్తుందని ఆశిస్తూ విరమిస్తున్నాను.

29th March 1956]

THE HON. Dr. B. GOPALA REDDI :—అధ్యక్షా, నేను కోరినట్లుగా కేవలం ఆశీర్వచన అక్షంతులు మాత్రం దీనిపైన పడలేదు మరల Budget మీద, demands మీద discussion మాదిరిగానే, దీనిమీద కూడ అక్షంతులు పడ్డాయి. ఏమైనప్పటికీ ఈనాడు జిల్లాలలో ఉన్నటువంటి విషయాలు పదేపదే చెప్పడం ఒక రకంగా మంచిదేనని నేను భావిస్తున్నాను. ఒకవేళ ఇది పునరుక్తిగా కనపడినప్పటికినీ, ఉన్నటువంటి వేదన అంతా ఒకేసారి వెలిబుచ్చితే, హృదయములో ఒక విధమైన శాంతి వస్తుందేమో అని ఉండవచ్చును. లేకపోతే పదిమార్లు పది విషయాలు చెప్పితే, ఎప్పుడైనా ఒకటైనా చేయకపోతారా అనే ఉద్దేశంతోనైనా ఉండవచ్చును. ఆవిధంగా, పదేపదే స్థానిక విషయాలు చెప్పడం ఒక రకంగా మంచిదని చెప్పవచ్చు. ఇప్పుడు యల్లా మందారెడ్డిగారు, కొన్ని కొన్ని L.D. Works మార్చిలో sanction చేసినారు, అవి ఈ నెలలో పూర్తికావు అన్నారు. అది నిజమే, ఈ విషయంగురించి Finance Secretary తోను, Development Commissioner తోను కూడ discuss చేశాను. ఈ విధముగా ఈ L.D. Works వచ్చే సంవత్సరంకూడ ఉంటాయి కనుక వాటి amounts lapse కాకుండా ఏదైనా సదుపాయమున్నదా అని A. G. తో గూడ మాట్లాడాను అందుకు వచ్చేసంవత్సరంకూడా అవి వినియోగించుకోవచ్చు, మీకేమి నష్టంలేదు దానివల్ల ఏమి ప్రమాదంరాదు, అనేమాట వారు చెప్పారు.

నాగార్జునసాగర్ కుడికాలవనుగురించి నెల్లూరు జిల్లాలో ఉదయగిరి తాలూకావారు, కనిగిరి తాలూకావారు అందరు అనేక పర్యాయములు చెబుతునే ఉన్నారు. ఏమైనప్పటికినీ యింతపెద్ద విలువగల ప్రాజెక్టును మనము కట్టిస్తున్నప్పుడు దానికి యిప్పటి అంచనాల ప్రకారము 122 కోట్లు ఖర్చు అవుతుందని అనుకుంటున్నాము. కాని యింకా 7, 8 కోట్లదాకా revised estimates వస్తూనే ఉన్నవి. ఇవి అన్నీ పూర్తి అయ్యేసరికి ఆ ప్రాజెక్టుకు మనము ఏ 150, 160 కోట్లదాకానో ఖర్చు చేయవలసివస్తుంది. ఇంత డబ్బు ఖర్చు చేసేటప్పుడు యీ project వల్ల return ఏమి రాగలదు అనేదికూడా మనము చూచుకోవలసి ఉంటుంది. ఈ డబ్బు కేంద్ర ప్రభుత్వమువారు మనకు గ్రాంటుగా యివ్వడము లేదు. అంతా మనకు అప్పు యిస్తున్నట్లుగానే వ్రాసుకుంటున్నారు. ఈ అప్పును మనము యిచ్చుకోవలసి ఉంటుంది. సరే అది వేరే విషయం. గోపాలకృష్ణయ్యగారు మరొక విషయము చెప్పారు. వారు అంతా ప్రాజెక్టును కేంద్ర ప్రభుత్వమువారే కట్టించి యివ్వాలనే మాటగా చెప్పారు. ఈ విషయమును గురించి నేను తరువాత చెబుతాను. యల్లమందారెడ్డిగారు చెప్పినట్లు ప్రభుత్వము చేయటానికి పూనుకుంటే, యీ ప్రాజెక్టుకు యింకా ఎక్కువగా ఖర్చుఅయి, దానికి తగిన ప్రతిఫలమురాకుండా తగ్గిపోయి

Dr. B. Gopala Reddi] [29th March 1956

నప్పుడు, అంత ఎక్కువ ఖర్చు చేయడము ఎంత న్యాయముగా ఉంటుందో చూచుకోవలసి ఉంటుంది. అంతే, నీరులేనటువంటి ప్రాంతాలను ఎప్పటికీకూడా నీరు లేకుండానే ఉండడమా అనేదికూడ మనము ఆలోచించాలి. నాకు ఆ విషయము కూడ తెలుసును. ఇంత పెద్ద స్కీమును ప్రభుత్వం తలపెట్టినప్పుడు, దానియొక్క ప్రతిఫలము తక్కువగా ఉన్నప్పుడు, ఒక్కొక్కసారి కొన్ని కొన్ని ప్రాంతాలు మనము మినహాయించవలసి ఉంటుంది. అందువల్ల యీ విషయాలన్నీ ప్రభుత్వము జాగ్రత్తగా పరిశీలించాల్సి ఉన్నది పరిశీలనకూడ చేస్తుంది. దానికి ఎంత విస్తీర్ణము తీసుకోటానికి వీలుఅవుతుందో అదికూడ పరిశీలన చేస్తాము. రాబోయే ఏప్రిల్ 9 వ తేదీనాడు యిక్కడికి కున్వర్ సేన్ వస్తారని ఆశిస్తున్నాము. అవసరమని తోస్తే, యల్లమందారెడ్డిగారు, యింకా వారితోబాటు ఎవరైనా కున్వర్ సేను వద్దకు deputation వెళ్లి యీ విషయమునుగురించి మాట్లాడవచ్చును. ఎందుకంటే డబ్బు శాంక్షను చేయవలసినవారు, కున్వర్ సేను గనుక వారితో అన్ని విషయాలు మాట్లాడి వారికి నచ్చచెబితే, అది అంగీకరించవచ్చునా, లేదాఅనేది వారు పరిశీలన చేయగలరు. కాబట్టి యీ విషయముగూడ వారితో చెప్పవలసిఉంటుందని నా అభిప్రాయము. నాగార్జునసాగర్ ప్రాజెక్టు కంట్రోలు బోర్డు మీటింగుకూడా జరగబోతున్నది. ఆ మీటింగుకు కున్వర్ సేన్ గారుకూడా వస్తారనిఆశిస్తున్నాము వెళ్లదలచినవారు deputation వెళ్లివారికి అన్నివిషయాలు అవగాహనచేయవచ్చు, మీరుఏవైనా విషయాలు ఉంటే తప్పకుండా చెప్పండి. అంతేకాని ఆ నెపముమాత్రము నామీద వేయవద్దు. ఎందుకంటే మనము అనేక విషయాలు గమనించి చేసుకోవలసిఉంటుంది. రేపు ప్రొద్దున యీ ప్రాజెక్టుకు రెండు వందల కోట్లుదాకా ఖర్చుఅయితే, దానికి ప్రతిఫలము ఏ 2 పర్సెంటో, 2½ పర్సెంటో వస్తే, దానికి కేంద్రప్రభుత్వముగాని, ప్లానింగు కమిషన్ వారుగాని ఒప్పుకోక పోవచ్చు. అందువల్ల యీ విషయాలు అన్నీ మీరుచెప్పి, దాని సంగతి బాగా అడగండి. నాకు యేమీ అభ్యంతరములేదు. సభ్యులు కొంతమంది ఎడమకాలువ సంగతికూడ చెబుతున్నారు. M. R. Appa Rao గారు, యింకా కొంతమంది నాగార్జున సాగర్ ప్రాంతములో మీటింగు అయినప్పుడు deputation కూడ వెళ్లారు. ఈ ఎడమకాలవను నూజివీడు, తిరువూరు తాలూకాలకు రావాలని deputation వెళ్లి చెప్పారు. మనము అడగదలచినది అడగాలనే నా అభిప్రాయము. దానియొక్క సాధక బాధకాలు బాగా పరిశీలించి, ఏది న్యాయముగా ఉంటుందో, ఏది తక్కువ ఖర్చులో ఎక్కువ లాభముగా ఉంటుందో, ఆ విషయాలన్నీ పరిశీలించి, శాంక్షను చేయవలసింది వారు గనక, మనము మనకు కావలసినవి వారిముందు పెట్టడము మంచిది. అవసరమని తోస్తే, నీటి ఉపయోగము ఏ విధముగా ఉండగలదో, ఆ విషయాలన్నీ వారు పరిశీలించి చేయవలసిన విషయముకాబట్టి, ఆ విషయాలు వారు గమనిస్తారు.

తరువాత బసిరెడ్డిగారు water rates లో కొన్ని ప్రాంతాలలో చాలా వ్యత్యాసాలు ఉంటున్నవి, అవి కొన్ని జిల్లాలలో ఒక విధమైన రేట్లు, మరి కొన్ని జిల్లాలలో యింకొక విధమైన రేట్లు ఉన్నవని అన్నారు. వారు యీ విషయాలు చెప్పినప్పుడు, యీ రేట్లను యింకా enhance చేయాలని అంటున్నారేమోనని నేను అభిప్రాయపడ్డాను. నాకు చాలా సంతోషము కలిగింది. అట్లా చేస్తే, అన్యాయముగా ఉంటుందేమోనని కూడా అనుకున్నాను. వారు చెప్పినదంతా విన్నతరువాత, నాకు ఆశ్చర్యము కలిగింది. అయితే యీ వ్యత్యాసాలు ఉంటున్నవి అంటే, దీనికి ఒక code ఏమీలేదు. ఒక్కొక్క ప్రాజెక్టును మనము తీసుకొన్నప్పుడు ఆ ప్రాజెక్టుక్రింద ఎంత యిస్తారు అనేమాదిరి ఒక బేరము పెట్టుకొని, యింత Water Rate యిస్తాము అని వారివల్ల ఒక agreement తీసుకొనిగూడ ప్రాజెక్టులు నిర్మించాలనిగాని దీనికి ఒక code గాని, రేటుగాని యేమీలేదు. దీనికి law అనేదిగూడ ఏమీలేదు. ఖచ్చితముగా యింత Water Rate ఇవ్వాలి అనే నిర్ణయము ఏమీలేదు. అది అంతా ad hoc గా నిర్ణయించారు ఈవిధముగా యిప్పటికి 40, 50 సంవత్సరాలుగా జరుగుచున్నది. అందులో మనకు Re-settlement కూడ ఎప్పుడైతే లేకుండా పోయిందో, అప్పుడే యివి అన్నీ కూడ ఎక్కడికక్కడ స్థభించిపోయినవి. ఇంతకుముందు Re-settlement ఉన్నప్పుడు 30 సంవత్సరముల కొక పర్యాయము యీ రేట్లు అన్నిగూడ సమీక్ష చేసుకుంటూ వచ్చారు. 1931, 1932 వ సంవత్సరములలో Re-settelment ను ఎప్పుడైతే విరమించుకున్నామో, అప్పటి నుంచి యీ రేట్లను సమీక్షచేయటానికి అవకాశము లేకుండా పోయింది. ఏమైనప్పటికినీ water rates ఒక జిల్లాలో ఉన్నవి. ఇంకొక జిల్లాలో లేవు. ఇప్పుడు ఉదాహరణకు చెప్పాలంటే కృష్ణా గోదావరి జిల్లాలలో, ముఖ్యంగా పశ్చిమ గోదావరి, తూర్పు గోదావరి జిల్లాలలో ఎకరానికి 6-4-0 రేటు మాత్రమే ఉన్నది. మా నెల్లూరు జిల్లాలో యిది యించుమించు అదే మాదిరిగా ఉన్నది. రేపు నాగార్జున సాగర్ ప్రాజెక్టు వస్తే, దాని ఆయకట్టు క్రిందకు వచ్చే భూములకు రేటు ఏది 15 రూపాయలో ఉండబోతున్నది. K. C. Canal క్రిందగాని, లేకపోతే దిగువ కాలవ క్రిందగాని, ఒక క్రాపుకు 10 రూపాయలు, రెండు క్రాపులు అయితే ఏది 15 రూపాయలో ఉంటుంది. అదే చోటులో dry crops అయితే అంత ఉండదు. Dry Irrigation అని wet Irrigation అని రెండు రకాలు ఉన్నవి. అప్పుడు ఎకరానికి పది రూపాయలకు తక్కువ కాకుండా రేటు ఉంటుంది. ఈ మాదిరిగా పలు చోట్ల పలు విధముల రేట్లు ఉంటున్నవి. ఆ ప్రాంతమును బట్టి, నీటి పారుదలనుబట్టి ఉంటుంది. ఇటీవల 10 సంవత్సరములలో పంజాబులోగాని U.P. లోగాని, Bihar లోగాని చూస్తే, అక్కడ యీ water rates అన్నీ ఎక్కువ చేశారు. న్యాయముగా చూస్తే,

Dr. B. Gopala Reddi] [29th March 1956

యిప్పుడు ఉంటే పరిస్థితులనుబట్టి వారు యిచ్చే భూమి శిస్తు, water rates అన్నీ కలిపి ఒక దామాషాలో ఉండాలి, ఆ దామాషాను తక్కువగా ఉన్నది కాబట్టి, దానిని యింకా కొంత హెచ్చు చేస్తే బాగుంటుందనే విషయాను అన్ని రాష్ట్ర ప్రభుత్వాలు ఆలోచించి ఆయా ప్రభుత్వాల వారు, వారియొక్క రాష్ట్రాలలో హెచ్చు చేశారు. Bihar లో cent per cent ఎక్కువ చేశారు. బహుశ Punjab లో కూడ 50% వరకు enhance చేసినట్లు తెలుస్తున్నది.

SRI PILLALAMARRI VENKATESWARLU :—రెండు రూపాయలను నాలుగు రూపాయలు చేసినా, అది cent per cent క్రిందకు వస్తుంది. ఆ దృష్టిలో cent percent అంటున్నారా ?

THE HON. DR. B. GOPALA REDDI :—రూ 6-4-0 లు ఉంటే, దానికి పైన 6-4-0 చేస్తే, దానిని cent per cent అనవచ్చు. రెండు రూపాయలు ఉంటే, దానికి యింకా రెండు రూపాయలు పెంచితే, అదిగూడ cent percent క్రిందకు వస్తుందనవచ్చు. ఏమైనప్పటికినీ యితర రాష్ట్రాలలో ఏ విధముగా రేట్లు పెంచబడినవో, అవి అన్నీ మనముకూడ గమనించి, మన రాష్ట్రములో గూడ హెచ్చు చేయటానికి అవకాశము ఉన్నదని ప్రభుత్వమువారి విశ్వాసము. ఆ ప్రతిపాదన శాసనసభలో ప్రవేశ పెట్టినప్పుడు బసిరెడ్డిగారు చెప్పినట్లుగా వ్యత్యాసాలు లేకుండాపోతాయి. కాబట్టి వ్యత్యాసాలు పోగొట్టటానికి అదికూడ ఒక ప్రయత్నము కాబట్టి, అది వచ్చినప్పుడు వారు సమర్థిస్తారని నేను ఆశిస్తున్నాను. వారు చెప్పినది మరొక విషయము ఉన్నది. కుడిమరామ్మతుల క్రింద ఉన్న కాలవల క్రింద భూములకు ప్రభుత్వము శిస్తువిధిస్తున్నది. అది న్యాయముకాదని, అనంతపురముజిల్లాలో అటువంటివి మినహాయించబడ్డవి అని, ఆ మాదిరిగా గుంటూరు, కడపజిల్లాలలో ఎందుకు చేయలేదని అన్నారు. ఈ విషయమును గురించి నేను మొదట్లోనే చెప్పాను. ఇదిఅంతా న్యాయముగా ఒక standardised code క్రిందగాని, చట్టరీత్యాగాని, fixed rates వేయడము లేదనిచెప్పాను. ఇది అంతా అక్కడక్కడ ad hoc గా జరుగుతున్నదని చెప్పాను. అట్లాగే జరిగిందని, కొన్ని యితరజిల్లాలలో కూడ, అది విధించడమా, లేదా అనేది కొంచెము దీర్ఘంగా ఆలోచించవలసిన విషయముగావున్నది. అనంతపురముజిల్లాలో అప్పుడు ఏ పరిస్థితులలో మినహాయించారోగాని, అదేపరిస్థితులు యితరజిల్లాలలో ఉన్నవో లేవో, వ్యత్యాసపరిస్థితులు ఉన్నవో లేవో, అనేది ప్రభుత్వము పరిశీలనచేసినప్పటికినీ, ప్రభుత్వానికి కొంతవరకు ఆదాయమువచ్చేటట్లు చేయడము మంచిదికాని, ప్రభుత్వానికి నష్టమువచ్చేటట్లు చేయడము మంచిదికాదేమో నని అనుకుంటాను. అయినప్పటికిని పరిశీలనచేస్తామని అంటే, తప్పకుండా చేస్తాము. కాని ఆ

level లోనికి యితరప్రాంతాలనుకూడా తీసుకునిరావటానికి ప్రయత్నించవలసిన అవసరము ఉన్నది అదిగూడ equalisation అనే అంటున్నాను. తగ్గించడము వల్ల equalisation కావచ్చు లేకపోతే హెచ్చించడమువల్ల equalisation కావచ్చు. అందువల్ల యీ విషయములో కొంతవరకు ప్రభుత్వము ఉదారముగా చూడవలసిన అవసరము వున్నది. నిజానికి మనరాష్ట్రములో water rates చాలా తక్కువగానే వున్నది. అందువల్ల బసిరెడ్డిగారు చెప్పిన point కూడ కొంతవరకు విపులముగా విచారించవలసిన విషయముగావున్నది.

వావిలాల గోపాలకృష్ణయ్యగారు నాగార్జున ప్రాజెక్టును కేంద్రప్రభుత్వమే ఎందుకు కట్టించి మనకు యివ్వకూడదు అనేమాటగా చెప్పారు. అయితే నేను ఒక్కటేమాట చెప్పదలచాను. లాభాలుపొందేవారు గుంటూరు నెల్లూరుజిల్లాలవారు. వారికి కావలసినడబ్బు అంతా కేంద్ర ప్రభుత్వముది. అదేమీ న్యాయముకాదు. మనకు ఒక పెద్ద ప్రాజెక్టు కావాలని మనము కేంద్ర ప్రభుత్వాన్ని అడిగాము. దానికోసము మనము ఆందోళనచేశాము. దానిని యిప్పుడు మనము తెచ్చుకున్నాము. కాబట్టి "దానికి అయ్యేఖర్చు మేమే పెట్టుకుంటాము దానియొక్క లాభాలుకూడా మేమే తీసుకుంటాము" అని చెప్పడము అనేది ఆత్మగౌరవముగా ఉంటుందేమోనని అనుకుంటాను. అట్లాకాకుండా దానికి అయ్యేఖర్చు కేంద్రప్రభుత్వము యిస్తే, లాభాలు అన్నీ మేము తీసుకుంటామని అంటే, అది ఏమంత సమంజసముగాలేదు.

ఇదిగాక మద్రాసురాష్ట్రములోని Lignite mining ని గురించి చెప్పారు. అది speculation కు సంబంధించింది. ఈ Lignite కోసము భూగర్భముత్రవ్వితే, అందులో తేళ్ళువున్నవో, పాములేవున్నవో లేక రాక్షసులే వున్నారో, ఎవరికినీ తెలియదు. అది జయప్రదమయితే, దానికి అయ్యే ఖర్చు అంతా కేంద్రప్రభుత్వము వారు భరిస్తున్నారు; లాభము అంతా మద్రాసుప్రభుత్వంవారు తీసుకుంటారు. ఒకవేళ నష్టమవస్తే అది కేంద్రప్రభుత్వమే భరించుకుంటుంది. ఇది ఒక pilot స్కీముగా కేంద్రప్రభుత్వమువారు డబ్బు advance చేస్తున్నారు. జయప్రదమైతే, లాభము మద్రాసువారిది. నష్టమువస్తే కేంద్రప్రభుత్వానిది.

SRI PILLALAMARRI VENKATESWARLU:—జయప్రదమైతే, లాభమంతా మద్రాసుగవర్నమెంటువారిదా? నష్టమువస్తే, కేంద్రప్రభుత్వమువారిదా! అలాంటప్పుడు మనకు నాగార్జునసాగర్ ప్రాజెక్టువిషయంలోకూడ జయప్రదమై లాభమువస్తే మనకు, నష్టమువస్తే, కేంద్రప్రభుత్వానికి, అనేమాదిరిగా ఎందుకు చేయకూడదు?

